THIS LITTLE BOOK

IS DEDICATED TO

*M. R. Ry. Sreemath Kumar Raja*
*K. V. Krishna Row Bahadur,*

Zamindar of Gampalagudem

BY

HIS BELOVED POET
D. SITHARAMA ROW,
COCANADA.

# పీ ఠి క.

—

ప్రత్యేకముగా ద్రౌపదియొక్క చరిత్ర మెత్తుకొని నాటకముగా రచించుటకు గథ చాలదనియే నా యభిప్రాయము. ఆ కారణమున నేను భారతంబు ననుసరించి ధృతరాష్ట్రుండు పాండవేయులను వారణావతంబునకు బంపుట మొదలుకొని స్వయంవరమువఱకును నున్న గాథ యంతయు వ్రాసి ద్రౌపదీపరిణయమను నామమిడితిని. ఇయ్యది నేను రాజమహేంద్రవరంబున 1911 సంవత్సరమున మహారాజ రాజశ్రీ సత్యవోలు గున్నేశ్వరరాయ సోదరుల యాంధ్రకేసరీ పత్రికకు సంపాదకుఁడనై యుండునప్పుడే రచించినను, కొన్ని కొన్ని కారణంబులచే నింత వరకును ముద్రింపఁబడలేదు. ఇయ్యది ముద్రణమగు భాగ్య మిప్పటికి దటస్థించినది. పెక్కుమంది సత్కవీశ్వరులు మార్గదర్శకులై యుండుటచే, నింగ్లీషు నాటకంబుల రీతిగా రంగములుంచితిని గాని నాటక లక్షణము లంతగా బాటింపలేదు. దోషముల కేమి! కాళిదాసాదికవులంతటి వారికే యొకప్పుడు గల్గుచుండు. అట్టి యెడల నల్పజ్ఞానవయస్కుండను విశేష భాషా పరిచయమును లేనివాఁడను, నగు నావ్రాతయందు దోషంబులుండుట యది యొక వింతగాదు. అట్టివి సదయ హృదయులు నాకుఁ దెలిపిన ద్వితీయముద్రణమందు సవరించెద. నాకు నితాంతాప్తులును, మదీయ శ్రేయోభిలాషులును, నూజవీడున నేను వుయ్యూరు సంస్థానోద్యోగినై యుండునప్పుడు నాకు బంగారు పతకంబు నొసంగిన వారును, ఆంధ్రభాషా పోషకులగుటయేగాక కవియై అభినవ పాండవీయాది గ్రంథముల రచించిన శ్రీమత్కునూరంరాజా కోటగిరి వెంకట కృష్ణారావు బహద్దరు జమీందారువారికీ గ్రంథంబుఁ గృతి సమర్పించినాఁడ.

కాకినాడ,
ది 25-6-16.

ద్రోణంరాజు సీతారామారావు.

# ఇందు వచ్చు పాత్రలు.



ధృతరాష్ట్రుడు—హస్తినాపురాధీశ్వరుఁడు.

భీష్ముఁడు—ధృతరాష్ట్రుని పెద తండ్రి

విదురుడు—కౌరవపక్షమున నున్నవాఁడు.

దుర్యోధనుఁడు—ధృతరాష్ట్రుని యగ్రసుతుఁడు.

దుశ్శాసనుఁడు— ,, ద్వితీయ సుతుఁడు.

కర్ణుఁడు—దుర్యోధనుని సఖుఁడు.

పురోచనుఁడు—లక్కయిల్లు నిర్మించినవాఁడు.

ధర్మ, భీమార్జున, నకుల, సహదేవులు:—పాండవులు.

కణికుఁడు—పాండవులవార్త ధృతరాష్ట్రునకు వినిపించినవాఁడు.

వ్యాసుడు—ముని.

బకాసురుఁడు—దైత్యుఁడు.

జాబాలి ) ఏకచక్రపురమున నున్న బ్రాహ్మణుని
సువిందుఁడు) కుమారుఁడు.

అంగారపర్ణుఁడు—గంధర్వుఁడు.

ద్రుపదుఁడు—పాంచాలాధిపుఁడు.

ధృష్టద్యుమ్నుఁడు—,, కుమారుఁడు.

విష్ణుశర్మ, రామశాస్త్రి:—భూసురులు.

బలరాముఁడు, కృష్ణుఁడు:—యాదవ పుంగవులు.

స్త్రీలు.

కుంతి—పాండవుల తల్లి.

హిడింబి—భీముని వరించిన దైత్యకాంత.

కుంభీనస—అంగారపర్ణుని భార్య.

ద్రౌపది—ద్రుపదుని పుత్రిక.

నర్మద—చెలికత్తె.

(ఇంకను నానా సందర్భమున పౌరులు సేవకులును మొదలగు వారు వచ్చెదరు.)

— —



శ్రీ

# ద్రౌపదీపరిణయము.

## నాంది.

---

మ॥ తలమీఁదన్ బడనున్న క్షత్రియయువన్ ♦ దప్పన్ దయంబూని మొ
న్వఁముగన్ద్రోన్న; దవాగ్నిలోఁ బడియు స ♦ త్పాత్రాత్ములై యుండు సు
జ్వలతేజంబునమించి; సజ్జనములై ♦ వ్వాడింత కాపాడఁ ని
శ్చలకారుణ్యమయుండు శ్రీశుఁడతఁడే ♦ సభ్యాళి రక్షించుతన్.

సీ॥ అధికసంతాప మ ♦ హాబ్ధిలోపలమున్గి
దిక్కుగానకను చిం ♦ తించువేళ
నడుకానలోఁజిక్కి ♦ బెడిదంపుటిడుముల
సందును మిక్కిలి ♦ గుందునాఁడు
దారికష్టంబుగా ♦ ధైర్యమున రిపుండు
చనుదెంచి యెదిరించు ♦ సమయమందు
క్ష్మాధీశులెల్లరు ♦ సల్పఁజాలని పనిఁ
జేయఁగా మిగుల య ♦ త్నించునపుడు

తే॥ గీ॥ పాండురాజనందనుల హృ ♦ త్పద్మములను
నిల్చి; కృపవెదఁజల్లుచు ♦ నిఖిల మంగ
ళంబులనుగూర్చి వెలసిన ♦ యంబుజాక్షుఁ
డిచ్చుగాతమీకు శుభంబు ♦ లెప్పుడదయను.

[నాంద్యంతమున సూత్రధారుడు—ప్రవేశించి]

అతివిస్తరమెందుకు? పూజ్యులగు నీ సభాస్తారు లాలస్యమునకు దాళఁజాలనివారు కదా. ఇంక నేను తొందరపడవలయును. (తెరవంకఁ జూచి) కుంకుమతిలకాంచితభ్రుకుటీ! నటీ! నీ యలంకారమింకను కాలేదా! ఎల్లప్పుడును నగలు శృంగారించుకొనుటయేనా! కాల హరణము సేయక రమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యా! కాలహరణము చేసినందులకు క్షమింపుఁడు. కమ్మలజత యందుండు నీల జాఱి పడిపోవుటచేత దానిని వెదకుచుంటిని. ఇప్పటికిఁగనబడినది.

సూత్ర—నీ కెప్పుడును భూషణంబులమీఁదనే భ్రాంతి. అందుకనియే యవి తలఁచు పోవుచుందువు. స్త్రీకి యివి యన్నియు భూషణములు కావు సుమా. గుణమే భూషణము.

నటి—నాథా! మీరు ద్వాపరయుగమునాటి మాటలు చెప్పుచున్నారు. ఇక్కాలమున నది యంతయు నాలోచించువారెవరు! అది తప్ప మనవాళ్ళ దగ్గిర తక్కినవన్నియు నున్నవి.

సీ॥ పతిసేవవిడనాడి ♦ స్వైరిణీవృత్తినిఁ
జరియించుచానలు ♦ చాలగలరు
బొట్టు మోటంచును ♦ బొట్టుపెట్టుటమాను
భామామణుల్ గదుఁ ♦ బ్రబలియుండ్రి
మగవారిరీతిగా ♦ బిగువైనపోక్కాలు
ధరియించు పడతులు ♦ దనరినారు
మానాభిమానముల్ ♦ మంటిలోపలగల్పి
తిరిగెడుయువిదలు ♦ వరలినారు
తే॥ గీ॥ ఎక్కడో మూలనున్నట్టి ♦ యింతులెల్ల
వృద్ధలయ్యును మైలైన ♦ వేసములను

దాల్చుచుండిరి సిగ్గును • దలఁగఁద్రోచి
కట్టా! కలికాలమీరీతిఁ • గ్రాలుచుండె.

సూత్రి—రమణీమణీ! జగంబుననున్న స్త్రీ బృందంబంతయు నట్టిదే యని యభిప్రాయపడుచుంటివా? అట్లైన్నటికిని జెప్పకుము. పైకిఁ బతివ్రతలమని చెప్పకొనెడి కాంతలకాగ్రహము గలిగించిన దానవగుదువు.

నటి—స్త్రీ బృందంబు నంతయు దూషించుటకంత వెఱ్ఱిదానను గాను. మంచివారు లేరనికాదు నా యభిప్రాయము. ఎవరో నూటికొకరు లేకపోరు. అట్టి పూతచరిత్రలిఖను నెక్కడనో యుంట చేతనే జగంబీతీరుగనైన నున్నది.

సూత్ర—అయినను నొకరిని దూషించుటకు మన కేమి యవసరమున్నది.

తే॥ గీ॥ అవనిలోపల నెవరు తా • మాచరించి
నట్టి పాపంబు వారలే • యనుభవింతు
రదియు గాకను భగవంతుఁ • డఖిల జనుల
చిత్తములయందు నుండి వీ • క్షింపుచుండు.

కాని యొక్కందుకు మాత్రము నాకు సందియమగుచున్నది. “ఆరుమాసములు సహవాసము చేసినచో వారు వీరగుదురు” అని యొక యార్యోక్తియున్నది. ఆ కారణంబున నీకు గూడ వారి గుణంబు లలవడునేమోయని భయపడుచున్నాను.

నటి—నాథా! ఇట్టిగుణములొకరిఁనిఁజూచినేర్చుకొనినచో రావు. వారి పురాకృత ప్రారబ్ధవశమున వచ్చును. చాలుఁ జాలు మీా సందేహమున కేమిలెండి.

సూత్ర—యువతీ! ఏదో యప్రస్తుత ప్రశంస కలుగఁజేసికొని ప్రస్తుత కార్యము మఱచితిమి.

నటి—ఇప్పుడు నన్నుఁ బిలిచిన కార్యమేమో సెలవిచ్చెదరా!

సూత్ర—

చ॥ సరసులు నీతికోవిదులు ♦ శాస్త్రవిచారులు పండితుల్ ధరా
వరులును మంత్రివర్గమును ♦ భాసురలీలను వచ్చి ద్రౌపదీ
పరిణయనామ నాటకము ♦ భవ్యముదంబున నాడుమంచు సం
బరమునఁనాజ్ఞ నిచ్చి రతివా ♦ నినుఁ బిల్చితి నిప్పు డందుకై.

నటి—ఏమి నాటకము! ద్రౌపదీ పరిణయమా! ఇందులోనే కాబోలు రుక్మాంగదుఁడు సీత అనవాళ్లు, సత్యభామ సరసము వుంటుంది.

సూత్ర—(నవ్వుచు) ప్రియసీ! నీ వెంత మూఢురాలవు. ద్రౌపదీ వివాహ కథయందు నవి యన్నియు నెట్లు వచ్చును. చూచి తివా! విద్యాబుద్ధులు లేకపోవుటచేత వచ్చిన యనర్థకము.

నటి—విద్యావద్దు ఏమీవద్దు. ఈలాగున బ్రతుకనిండు. విద్యనేర్చి గంతులువైచుచున్న ఆడవాళ్లకు వచ్చిన యెక్కువ మర్యాద యేమున్నది. విద్యలేని నాకేమి తక్కువయున్నది. (ఇంచుక యూరకుండి) మనోహరా! ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినది. అర్జునుఁడు మత్స్య యంత్రమునుగొట్టి ద్రౌపదిని పెండ్లియాడిన కథ యిదియేకదా. సరే తెలిసినది. ఇది యే పురాణములోనో యుండవలెను. బాగా జ్ఞాపకములేదు.

సూత్ర—

తే॥ గీ॥ ధరణిఁ బంచమ వేదమై ♦ తనరునట్లు
బాదరాయణుఁడు రచించె ♦ భారతంబు
సమర భాషయందున; నన్న ♦ యాదికవులు
తెలుఁగుఁ జేసిరి దానినిఁ ♦ గలువకంటి.

ఆ భారతంబున నీ ద్రౌపదీపరిణయకథ యున్నది. దాని ననుసరించి యియ్యది నాటకముగా వ్రాయఁబడినది.

నటి—గ్రంథకర్త యెవ్వరో యెఱుఁగవచ్చునా !

సూత్ర—

తే॥ గీ॥ అతఁడు ద్రోణమరాజ వం ♦ శాబ్ధి చంద్రుఁ
డమలగుణుఁడు నారాయణా ♦ హ్వాయసుతుండు
గవి విధేయి సీతారామ ♦ కవివరుండు.
వ్రాసె; నతఁడు మనకుఁ జిర ♦ పరిచితుండు.

నటి—అవును. ఈతని నాటకము లిదివరకే యనేకములు లోకఖ్యాతి వహించియున్నవి—ఇంక మనము నాటక ప్రదర్శనోద్యోగంబున నుండుదము.

సూత్రి—నాటక ప్రదర్శనంబునకుఁ బూర్వము ఋతువర్ణనము సేయుట యాచారమై యున్నదిగదా.

నటి—అట్లయిన నే ఋతువును వర్ణింపవలెనో యానతిండు.

సూత్రి—సకల సౌఖ్యప్రదమైన యివ్వసంతమును గూర్చియే!

నటి—మంచిది.

లయగ్రాహి.

కాంతులు నిరంతరము ♦ కాంతలనుగూడి ముద
మెంతయును గల్గగల ♦ కాంతవన కేళీ
స్వాంతులయి యేగికడు ♦ సంతసముమీఱఁ దరు
సంతతుల నీడలను ♦ శ్రాంతిగొనుచుం బూ
బంతులను బూనుచును ♦ బంతమున నాటలను
జెంతయును నాడుచును ♦ బ్రాంతములలో శ్రీ
కాంతసుతు క్రీడలన ♦ సంతముగ దేలగను
వింతయగు కాలము వ ♦ సంతమిదియొప్పున్.

సూత్ర—నీ వర్ణనంబునకును, గాన మాధుర్యంబునకును సభికులు మిగుల సంతసింపుచున్నారు.

(తెరలో)

ఉ॥ కౌరవరాజ చంద్రుఁడవ • ఖండపరాక్రమశాలివీవు; ధా
త్రీరమణీ మనోహర! య • ధీరులఁ బాండవులన్ దలంచి యీ
తీరున గొప్ప భీతిని మ • దిన్ గననేటికి నెట్టులైన న
వ్వారిని నిపురంబునెడ • బాసి చనంగను జేయుమీ వెసన్.

సూత్ర—సతీ! కర్ణ దుర్యోధనులు కాబోలు యిట్లు వచ్చుచున్నారు. మనము పోవుదము రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.





శ్రీ

# ద్రౌపదీపరిణయము.

## ప్రథమాంకము.

[ కర్ణ దుర్యోధనులు ప్రవేశము. ]

కర్ణు — మిత్రమా ! దుర్యోధనా !

ఉ॥ కౌరవరాజచంద్రుఁడ వ ♦ ఖండ పరాక్రమశాలి వీవు ధా
త్రీరమణీ మనోహర ! య ♦ ధీగుల పాండవులన్ దలంచి యీ
తీరున గొప్పభీతిని మ ♦ దిన్ గననేటికి నెట్టులైన నం
వ్వారిని నీపురంబు నెడఁ ( బాసి చనంగను జేయు మీవెసన్.

దుర్యో — సఖా ! కర్ణా! మాటలవలన నేమిప్రయోజన మున్నది. అంధుండగు మాజనకుండు రాజ్యంబున కనర్హుండగుటం జేసి మా పినతండ్రియగు పాండునృపాలుండే యీ కురురాజ్యభారంబుఁ దన భుజస్కంధమునందు నిలుపుకొని బాహుబలపరాక్రమ శౌర్యంబులు దీపింప ననేక భూనాథుల గెల్చి ధనంబు దెచ్చి మాతండ్రిచే ననేక యాగంబులు జేయించి విమలయశంబు నందినాడు.

తే॥ గీ॥ హరిణశాప కారణమున ♦ నతఁడు వనినిఁ
బ్రాణములఁ బాసి చేరెను ♦ స్వర్గపదవి
నాటినుండియుఁ గుంతియు ♦ మేటి శౌర్య

ధనులు నాపాండురాజ నం • దనులు మాగ్ర
హంబునను వర్ధిలుచునుండి • రనఁగు సఖుఁడ.

మా గృహంబుననుండి మాతోఁ బాటు విద్యల నభ్యసించి మాకంటె నెక్కువ బలశాలులైనారు.

తే॥ గీ॥ పార్థుని మహాస్త్ర సంధాన • పటిమఁ గాంచి
వాయుజు గదాప్రవీణత • వరుసఁ జూచి
మాద్రిసుతుల ఘన పరాక్ర • మంబు దలఁచి
భయమునొందుచు నుందును • భావమందు.

ఆ పాండవేయులు నిజముగా నాకు హృదయశల్యములవలెఁ గన్పట్టుచున్నారు.

కర్ణు — రారాజా!

తే॥ గీ॥ ఎట్టులో వారితోఁ బగఁ • బెట్టుకొంచు
బురము వెడలించుమార్గంబు • నరయుమయ్య
చిక్కుఁ జింతయు లేక నీ • చిత్తమందు
సంతసముబూని మెలగెదు • క్ష్మాతలేంద్ర.

ఇయ్యదియే యిప్పుడు మనకుఁ దగిన కర్తవ్యము.

దుర్యో — నీవు చెప్పినది బాగుగనే యున్నది; కాని,

ఉ॥ తమ్మునిపుత్రులంచు గుణ • ధార్మికులంచు ననేకవైరి బృం
దమ్మును గూల్పగాదగిన • ధైర్యముగల్గిన వారలంచుఁ జి
త్తమ్మున నూహఁ జేయుచు ము • దమ్మున మన్ననసేయుచుండెఁ దా
నిమ్మహి నాదుతండ్రి కను • హీనచరిత్రులఁ బాండవేయులన్.

సీ॥ ధర్మమే నిరతంబు • దనకు భూషణ మటంచు
దలచి వర్తించు నా • ధర్మసుతుఁడు •
భండనంబులను ను • ద్దండ బలమ్మున
వైరివర్గము గూల్చు • వాయుజుండు

శస్త్రాస్త్రవిద్యలో • సాటిలేక జరఁగుంచి
యశమందుచుండును • నర్జునుండు
అన్నదమ్ముల కింత • యైనను తగ్గక
మాన్యులై యుండిన • మాద్రితనయు
తే॥ గీ॥ లనుచుఁ దలపోసి నిరతంబు • నాత్మయందు
భవ్యమోదంబు నందుచుఁ • బాండుసుతుల
గాంచుచుండెను యెంతయో • కరుణతోడ
మంచిచెడ్డలు దెలియక • క్ష్మాధవుండు.

మా తండ్రిగారు వారికిచ్చుచున్న చనువును దలంచి వారును గర్వాంధకార చేతస్కులై కన్నును మిన్నునుఁ గానకయుండి మా రాజ్యలక్ష్మిని హరించుటకు లోలోపల ప్రయత్నము సేయుచున్నట్లు వినియున్నవాఁడ.

కర్ణ—అన్నా ! ఎంత దారుణము.

తే॥ గీ॥ తిన్నయింటను వాసాల • నెన్ను పగిది
భవ్య భవదీయ రాజ్య సం • పదలు గొనఁగ
యత్నమును సేయు పాండురా • జాత్మజులను
సమయజేయుటే తగుపని • క్ష్మాతలేంద్ర.

దుర్యో—అట్టిది మనము చేయఁగలుగుదుమనుట కలలోనిమాట.

కర్ణ—ఏమి ! మిత్రమా ! అట్లు పలుకుచుంటివి !

చ॥ భరతకుల ప్రదీపుఁడవు • బాహు పరాక్రమశౌర్య విక్రమ
స్ఫురణ జరిఁవుచుంటి వరి • భూపతులెల్లరు నీకు మ్రొక్క సో
దరశత మెల్లవేళలనుఁ • దద్దయు భక్తినిఁ గొల్వఁ ; బాండుభూ
వరుని కుమారులన్ వినిన • భావమునన్ భయమేల చెప్పుమా.

దుర్యో—మిత్రమా ! శోకభయ మేమియులేదు. వారిని మనము చంపలేమనుటయే !

కర్ణు—రాజా! ఆగ్రహింపకుము.

చ॥ సెలవిడి పంపుమీయిప్పుడె ♦ చెచ్చెర నేఁజని పాండవేయులన్
గలన వధించినీదు పద ♦ కంజ సమీపమునందునుంతు నా
తులువల శీర్షరాజములు ♦ దోర్బల విక్రమశౌర్య మేర్పడన్
బిలువఁగవద్దు కర్ణుఁడను ♦ పేరున నట్టులు సేయకుండినన్.

దుర్యో—అకారణంబుగ వైరము గల్పించుకొన్నచో నిందాభారము
మన తలపైఁ బడును. అదియట్లుండ వారిని గెల్చుటకూడ య
సాధ్యమే, ఎందుకంటివేని

సీ॥ త్రోయింపగాలేదె ♦ తోయంబులందున
పాశంబులను నామఁ ♦ బద్ధుఁజేసి
కొట్టింపగాలేదె ♦ దిట్టయౌ మల్లుచేఁ
గ్రీడా పరశ్రాంతిఁ ♦ గీలుపడఁగ
కఱపింపగాలేదె ♦ ఘన సర్పములచేఁ
బూర్ణనిద్రను దాను ♦ మునిఁగియుండ
బెట్టింపగాలేదె ♦ విషభోజనంబును
మాయమాటలచేత ♦ మఱుగుఁబుచ్చి

తే॥ గీ॥ అకట! యెన్ని జేసినఁగాని ♦ యనిలపుత్రుఁ
డింతయును నొవ్వకుండెను ♦ నేమిబలమొ
దానిఁ దలఁచినయంతనే ♦ భావమందు
భయము గల్గుచునుండును ♦ వరసఖుండ.

ఆకారణమునంజేసి నెమ్మదిగా సామవాక్యములచే వారల నీపురము
వెడల నడపవలయును. (ఇంచుక యూరకుండి) ఇంకొక్క విశే
షము నీకుఁ జెప్ప మఱచితిని.

కర్ణు—అదో యెట్టిది!

దుర్యో — తే॥ గీ॥ ధర్మచారిత్రుఁ డనుచుఁ • దలఁచి ధర్మ
నందనుని యౌవరాజ్యంబు • నందు నిల్ప
యత్నమును సేయుచుండెను • నంధనృపతి
యుర్వి నతఁడేల నేఁజూచి • యోర్వఁగలను.

కర్ణ — అట్లయిన నింక సందియంబందక నెట్లులయిన మీ తండ్రిగారితో నీవిషయ మాలోచించి, పాండవులను నీయూరునుండి వెడలఁగొట్టింతము. తరువాత సంగతిఁ జూచుకొనవచ్చును. (ప్రక్కఁ జూచి) అదిగో మీతండ్రిగారు సంజయునితో నేదియో మాటలాడుచు సుఖాసీనులై యున్నారు. నీవు మాట్లాడుట కిదియే సమయంబు. రమ్ము. (నిష్క్రమింతురు.)

( తెర లేచును. )

—:[ధృతరాష్ట్రుఁడు—సంజయుఁడు ప్రవేశము]:—

ధృత—(సంజయునిఁ జూచి) సంజయా!

ఉ॥ అంధుని నన్ను రాజ్యమున • కర్హునిఁ జేసి భరంబు దా భుజా
స్కంధమునందు నిల్పుకొని • శౌర్య పరాక్రమ మేర్పడంగ ; స
ర్వాంధుల నెల్లఁ జక్కడఁచి • ద్రవ్యము తెచ్చి మఖంబులన్ కృపా
సింధుఁడు నాదు సోదరుఁడు • జేయఁగఁ జేసెను నన్నుఁ బేర్మిమై.

అట్టి యనుఁగుదమ్ముఁడైన పాండురాజుయొక్క మృతింగూర్చి కల్గిన సంతాపం బింకను నామనంబును వీడకయున్నది.

తే॥ గీ॥ తమ్మునిఁదలంచినంత చి • త్తమ్మునందు
నధికసంతాపమగును ; నే • త్రాబ్జములను
నీరుగాఱఁగఁ గడఁగు నెల • యేయురీతి
యిట్టితమ్మునిఁగందునే • యెన్నఁడైన.

నిర్భాగ్యుఁడనైన నాకట్టితమ్ముఁ డేలబ్రతికియుండును.

సంజ—గతించినదానికై యిప్పుడు నగచినందువలనఁ బ్రయోజన మే మియున్నది.

చం॥ సురలవరప్రసాదమున ♦ శోభిలినారలు ధర్మమూర్తులా
వరసుతు లేవు రీక్షరణి ♦ పాండునృపాలుని గర్భమందు; స
చ్చరితులవారిఁ జూచుకొని ♦ స్వాంతమునందునఁ బాండురాజె యీ
ధరణిని యున్నవాఁడనుచుఁ ♦ దాపము వ్వాయుదు కౌరవేశ్వరా.

ధృత—సంజయా! నీవుచెప్పినట్లు పాండురాజనందనులకు గుణసంపదల యం దెవ్వరును సాటిగారుసుమా! నాయెడలఁ బాండురాజెట్టి భక్తిఁబూని చరియించెనో ధర్మసుతుండును నట్లే చరియింపు చున్నాఁడు. అతని బ్రాహ్మణభక్తియు, గురుజనానురక్తియు, ధర్మకార్యాసక్తియుఁ, బొగడుటకు వేనోళ్ళ చాలువమైనను శక్యుఁడుగాఁడు. ఆకారణముచేతనే ధర్మతనూభవునికి యౌవరాజ్యపద వి నొసంగితిని. ఇట్లు గావించినందుకుఁ బ్రజలెల్లరును నన్ననేక భంగుల వినుతించినారు.

సంజ—రాజేంద్రా! నీవు చక్కని పనిఁగావించితివి. అతఁడు యౌవ రాజ్యపదమందుండఁగా రాజ్య మభివృద్ధినొందుట కేమిలెక్క. అరిరాజన్యులెవ్వరయినను గన్నెత్తి చూడఁగలరా! (ఇంచుక యూరకుండి ప్రక్కదిరిగిచూచి) మహారాజా! ఎందులకో దుర్యోధనకర్ణులిచ్చటికి వచ్చుచున్నారు. వారివెంట శకుని దుశ్శాసనులుకూడా యేతెంచుచున్నారు.

[దుర్యోధన కర్ణ శకునిదుశ్శాసనులు ప్రవేశము.]

దుర్యో—(ధృతరాష్ట్రునిఁజూచి) తండ్రీ! వందనములు.

ధృత—కుమారా! వర్ధిల్లుము.

దుర్యో—భగవంతుఁడిచ్చిన యూగుర్దాయమున్నంతవరకు వర్ధిల్లక దప్పదు. నీవు ఆశీర్వచనములచేతను, మాటలచేతను మమ్ముల వర్ధిల్లజేయనెంచెదవుగాని క్రియలో మాత్రము చూపవు.

ధృత—కుమారా! అట్లు పలికెదవేమి! నేను నీయెడలజేసిన లోపమేమి?

దుర్యో—నీవేమియునుఁ జేయలేదు. నా నాశ్రితఫలమిూరీతిగాఁ బరిణమించినది.

శకుని—సుయోధనా! ఏటికీ యెత్తిపొడుపుమాటలు. నీవగాదెంచిన కార్యమేదియో మిూతండ్రిగారికిఁ దెలుపుము. వారు చేయనప్పుడుగదా నిష్ఠురోక్తు లాడవలయును!

దుశ్శా—అగ్రజా! నీ కార్యమేదియో తండ్రిగారికిఁ నివేదింపుము.

కర్ణు—మిత్రమా! చల్లకువచ్చి ముంత చంకనుబెట్టినచో నేమిలాభమున్నది.

సంజ—(తనలో) ఈదుష్టచతుష్టయమేదియో దురాలోచనచేసియే యిచ్చటి కరుదెంచినారు. సరే! ఏదియెట్లయిన నాకేల!

దుర్యో—తండ్రీ! మేమునీకుఁ బుత్రులముగామా! అట్టియెడల మేము నీకేమి యుపకారమాచరించితిమి. మాయెడల నింత నిర్దయ వహించుటకుఁ గారణమేమి!

ధృత—కుమారా! నావలనయున్నదోష మెట్టిదియో చెప్పుము.

దుర్యో—ఏమికావలయును. ఈచేసినది చాలదా. వినుఁడు.

ఉ॥ తమ్మునిపుత్రులంచును; నను • దమ్ముని సాకఁగవచ్చుఁగాని రా
జ్యంబునొసంగి నీసుతుల • కందరికిన్ హృదయంబులందు దుః
ఖమ్మును గల్గఁజేయుదువె • కానివిధంబుననిట్లు సేయ భా
వ్యమ్మె సమస్తమున్ దెలిసి • వర్తిలుచుంటివి కాదెభూవరా.

తండ్రీ! తమ్ముని పుత్రులందు నీకుఁ బ్రేమయుండిన నుండుఁగాక. వారిని నీయింటనుంచుకొని వలసిన సంపదలనిచ్చి కాపాడవచ్చును.

అందులకు మే మభ్యంతరపెట్టువారము కాము కాని ధర్మనందనుని యౌవరాజ్యపదమందు నిలిపినాఁడవు దీనంజేసి మా కపాయము వాటి ల్లదా! మే మేమయిపోవుదుము.

ధృత.—(తనలో) వీరందరును నెప్పుడును నేదియో దురాలోచన సేయుచుందురే. (ప్రకాశముగా) వత్సా! దీనంజేసి మీ కేమికొఱఁతపడినది. లేనిపోని కల్పించుకొని చిత్తమున నాందోళనఁ జేర్చుకొనుచుందువు.

దుర్యో.—దీనివలన మా కపాయము లేదందురా!

ధృత.—ఏమి యుపాయమున్నదిరి? ప్రజ్ఞాచక్షుండనగుటంజేసి రాజ్యపరిపాలనంబునకు సమర్థుండనుగానుగదా. సమర్థుండైన భీష్ముండు రాజ్యవిషయమై యిదివరకే బిట్టుప్రతిన వహించియుండెను. అట్టిచో నాతమ్ముఁడైన పాండురాజు నన్ను రాజుగానిలిపి తద్భారమంతయు నాతఁడువహించి నన్నతిభక్తితో సేవింపుచుఁ దన పరాక్రమంబున వైరిరాజుల నదిమి కప్పంబులఁ దెచ్చియిచ్చుచు, ననేక ధనరాసులఁ బోగుఁజేసి నాచే ననేక యాగంబులఁజేయించి తుదకు శాపవశంబున మృతుండయ్యె. ఆతని కుమారులైన యీ పాండవులును గుణములందుఁ దండ్రినిబోలినవారు. అందు ధర్మతనయుండు ప్రజ్ఞాన్వితుండును, సత్యసంధుఁడును నగుటంజేసి వానికి యౌవరాజ్యపదమిచ్చితిని. దీనంజేసి రాజ్యంబు వృద్ధియగును. భీష్మద్రోణవిదురాదులును దీనికి సంతసంబున సమ్మతించిరి. వారును నన్నుఁ బాండురాజువిధంబున నతిభక్తితో సేవింపుచుండిరి.

దుశ్శాస.—తండ్రీ! పైతృకంబైన రాజ్యభారము పాండుభూవిభుఁడు వహించియుండుటంజేసి యాతని నందనుఁడు ధర్మతనయుం డెప్పుడు రాజయ్యెనేని మముందుగూడ

గుదురు. మేమును మాపుత్రపౌత్రవర్గంబును నేమయిపోదుము. మేమందరమును వీరికి దాసులమై సేవకులరీతిఁ జరియింపుచుం డవలయునుగదా. పరులపంచఁజేరి బ్రతుకఁగలమా. మాగోడు నీవొక్కింత విచారింపవలదా!

శకుని—మహారాజా! దుశ్శాసనుండుపల్కిన వాక్యములు సత్యమే.

కర్ణు—అందుకు సందియమేమియును లేదు.

దుర్యో—తండ్రీ! నేనాపాండుతిలయుల పరాక్రమంబునకు నిరంతరం బును భీతిబొందుచుందును పాండురాజుయొక్క పరిపాలనంబున హాయిఁజెంగియున్న ప్రజలెల్లరును ధర్మశాలియయిన యుధిష్ఠిరుని పరిపాలనంబునకే చూచుచుందురు. ఇప్పుడే ప్రజలందరును ధర్మతనయునికి వశ్యులై నన్నుఁ జూడకయున్నారు. ఇఁకఁ గొన్నాళ్ళు పోయినచో నాపేరునైనఁ దల్పెట్టరు. అతఁడు ప్రజానురాగమునడసి తనరుచున్నాఁడు. అతఁడే రాజయినచో మాకుండతావుండదు.

ధృత—(తనలో) వీరు పలుకుచున్నవాక్యములు నిశ్చయమే. ప్రజలెల్లరును ధర్మజుని పరిపాలనంబును వేనోళ్ళఁ బొగడుచున్నారు. ఇందుకేమితెరవు నూహింపనగునో తోఁచకున్నది.

కర్ణు—(ధృతరాష్ట్రునిఁజూచి)

ఉ॥ భారతవంశజాతుఁడవు ♦ బాహుబలాఢ్యుల సత్కథాకులన్
ధారుణిగాంచి; సజ్జనులు ♦ ధర్మచరిత్రుఁ డటంచుఁజెప్ప వి
స్తారయశంబుగాంచితివి ♦ ధర్మవిధంబులు నీకుఁదెల్పగా
నేరము; నీకునుం దెలియు ♦ నేరసిప్పున్న వె కౌరవాధిపా.

మహారాజా! ఈ భూతలంబెల్లను మీయదియే. పాండురాజు మిమ్ములను రాజుగాఁజేసి వ్యవహారంబులన్నియు నాతఁడు చక్కబెట్టుచువచ్చె అంతమాత్రమున నాతనిసుతులు దీనికెల్లధిపతులగుదురా.

కావున మీ కుమారుల క్షేమంబు విచారించుట మీకు శ్రేయస్కరము.
ధృత — కుమారులారా! అట్లయిన నిప్పుడేమి సేయుచుందురు.
దుర్యో —

తే॥ గీ॥ కరుణ నాయందు నీకునుఁ ♦ గలిగెనేని
పాండవుల వారణాసికిఁ ♦ బంపుమయ్య
కొన్నినాళ్లేగినంతనె ♦ కొమరుమిగుల
మఱల నే తేరవచ్చును ♦ మహితలేశ.

అప్పటికి రాజ్యము మనకు సుప్రతిష్ఠితంబై ప్రజలెల్లరు మనకు వశ్యులై యుందురు.
ధృత — (తనలో) కష్టము. కష్టము.

చం॥ చినతనమాదిగాఁగనను ♦ జేరిన పాండుకుమారచంద్రులన్
ఘనకృపతోడఁ బెంచితిని ♦ గాదనకిప్పుడు వీరిమాటపైఁ
జనుఁడు పురంబువాసియని ♦ చయ్యనఁ బల్కఁగ సమ్మతించునే
మనమకటా; యికేమని కు ♦ మారులకోరిక మాన్పనేర్తునో.

తే॥ గీ॥ తండ్రి; నేనే యటంచును ♦ దనదుమదినిఁ
దలఁచి సేవింపుచుండెను ♦ ధర్మతనయుఁ
డట్టివానిని కారణం ♦ బరయకుండ
పురము వెడలింపనెట్లోర్తు ♦ కరుణలేక.

(ప్రకాశముగా) కుమారా! నీవు దారుణమైనకోరికఁ గోరుచుంటివి. అకారణము ధర్మచరిత్రులయిన పాండుకుమారుల నెట్లు బొమ్మని చెప్పఁగలను. ఇట్టి యకార్య మాచరించితినేని లోకులెల్ల నన్నుఁ బరమపాతకుఁడని దూషింపరా. ఇది యట్లుండ వృద్ధులైన భీష్మద్రోణవిదురులు దీని కెట్లు సమ్మతింతురు.
దుర్యో — తండ్రీ! నీవెట్టులయిన మా మాట వినకుండునట్లనేక మాటలు చెప్పుటవలనఁ బ్రయోజనము లేదు. నీవు సర్వస్వతంత్రుం

డవు. నీ కొఱకలయాజ్ఞతోఁ బనియేమున్నది. నీయాజ్ఞాగౌరవంబున వారెల్ల యొడంబడుదురు. అశ్వత్థామ నాకిష్టుఁడయి యుంటఁజేసి పుత్రవాత్సల్యమున ద్రోణాచార్యుండు నన్నుడఁబాయఁడు. కృపాచార్యుఁడు ద్రోణునిఁబాసి యుండకపోవుటచే నాకడనే యుండును. భీష్ముండేజోలికినిఁ బోవక యూరకుండును. విదురుండు పాండవపక్షపాతియయ్యును దాసుక్కుఁడై యుంటంజేసి నాకపకారమేమియునుఁ జేయఁజాలఁడు. చేయఁదలంపఁడు. కావున నీవు సంకోచింపక బాంధుకుమారులను వారణాసికిఁ బంపుము. ఇందులకన్యథా వర్తించితివేని నాదేహమగ్నికాహుతి గావించుట నిజము. రాజ్యసంపదలులేక దాయాదుల యొద్ద దాసుఁడనై యుంటకంటె నదియేమేలు.

ధృత—అంత సాహసకార్యమేల చేయవలయును? నీ యభీష్టమే నెఱవేర్చెదను. (సంజయునిఁజూచి) సంజయా! నీవరిగి పాండవాగ్రజునిటకుఁ దోడ్కొనిరమ్ము.

సంజ—(తనలో) ఆహా! కుమారులమాట నాలించి యీవృద్ధరాజెంత పాపమున కొడిఁగట్టినాఁడు. (నిష్క్రమించును.)

ధృత—ఇంక నీవు చింతఁబాసి యుండుము.

దుర్యో—(దుశ్శాసనునిఁ జూచి) మీరందఱును నిచ్చోట నుంటిరేని మన మందరమును నేదియో దురాలోచన జేసి వారిని వెడలనడుపుచుంటిమని యనుమానించెదరు కావున నిప్పటికి మీ రరిగి కొంచెముసేపు తాళి నన్నుఁ గలసికొనుఁడు.

(దుశ్శాసన శకుని కర్ణులు నిష్క్రమింతురు.)

దుర్యో—(తనలో) ఇప్పుడు నాకుఁ గొంచెము యానందముకలిగినది. పాండవేయులు తప్పక నాతండ్రియాజ్ఞపై వారణాసికేఁగుదురు. అచ్చోట వీరికై యొక లక్కయిల్లును పురోచనునిచే నిర్మింపఁ

జేసి దాని కగ్నిఁబెట్టునట్లు గావించెదను. దానంజేసి వారంద
దగ్ధులయ్యెదరు. అప్పుడు నాకు సంపూర్ణమైన యానందము
కలుగును.

[ధర్మరాజు సంజయునితోఁ బ్రవేశించును.]

సంజ—(ధృతరాష్ట్రునిజూచి) దేవా! యువరాజగు ధర్మనందనుం డరు
దెంచినాఁడు.

ధర్మ—తండ్రీ! భవదీయపాదపంకేరుహంబుల కీసుతుండు నమస్కరిం
పుచున్నాఁడు.

ధృత—వత్సా! సకలసంపదలనందుచుఁ బెక్కేండ్లు తమ్ములతోఁగూడ
వర్ధిల్లదవుగాక!

ధర్మ—భవదమోఘాశీర్వచనంబు ఫలించుఁగాక! తండ్రీ! నాయందుఁ
గృపవహించి రావించినకారణం బెట్టిదియో సెలవీయఁగోరెదను.

ధృత—కుమారా;

సీ॥ నాయందుభక్తిని ♦ ననిశంబుఁజూపుచు
ధరణిభారమునంత ♦ తానుబూని
శత్రురాజులనెల్ల ♦ సంగ్రామరంగంబు
నందునజెండాడి ♦ యశముగాంచి
ధనరాసులనుదెచ్చి ♦ తప్పకనాకిచ్చి
మఖములెన్నెన్నియో ♦ మహిమమీఱ
జేయించెనాచేత ♦ క్షితితలాధిపులెల్ల
బ్రధ్వయందుననన్ను ♦ వినుతిసేయ

తే॥ గీ॥ నట్టియనుఁగుఁదమ్ముండుమీ ♦ యయ్యపాండు
రాజు; వేటాడసరిగి య ♦ రణ్యమందు
భవ్యచారిత్రులనుమిమ్ముఁ ♦ బడసి; శాప
కారణంబునఁజేసి స్వ ♦ ర్గంబుజేరె.

పూతచారిత్రుండును, నాశ్రితజనహృదయపంకజభాస్కరుండును, వైరివీరదర్పాంధకార ప్రభాకరుండును, నిరంతర సర్వదేవతా చింతన మానసుండును, నగు మాజనకునకు సచ్చరిత్రులైన మీయట్టి తనయులున్నందుకుఁ బుణ్యకర్మలు జేయుట యుత్తమమన్ని నాకుఁ దోచినది. ఆకారణంబునఁజేసి మిమ్ములను వారణాసికిఁ బంపనెంచితిని.

ధర్మ—తండ్రీ!

చం॥ జనకుఁడు మమ్ములన్విడిచి ♦ స్వర్గముజేరెను నాటినుండియుఁ
జననిని మమ్ములన్మిగుల ♦ సత్కృపతోడను సాకుచుంటివో
యనఘ! త్వదీయవాక్యముల ♦ కడ్డముజెప్పఁగ నెంచువార మే
మనమున మమ్ముఁగూర్చియును ♦ మానమునొందకు పార్థివోత్తమా.

తండ్రీ! మాజనకుండు మరణించిననాటనుండియు మమ్ము నీవు కన్నపుత్రులకంటె నెక్కుడు ప్రేమతోఁ బెంచుచుంటివి.

తే॥ గీ॥ బాల్యమందునమాకు జ్ఞా ♦ పకము లేదు
తండ్రినీక్షించినట్టులో ♦ ధరణిపాల
తండ్రివీవేయటంచుఁ జి ♦ త్తంబునందు
దలఁచివర్తింపుచుంటిమి ♦ తథ్యముగను.

ధృత—(తనలో) ఆహా! ఏమి! ఈతనివాత్సల్యము. కల్ల కపటంబులెఱుంగని మానవుండన్న ధర్మనందనునినే యనవలయునుగదా. నిశ్చయముగా నిట్టి శాంతస్వభావుని, నిట్టి ధర్మచరిత్రునిఁ బురంబునుండి వెడలనడుపుచుంటినిగదా! (ప్రకాశముగా) వత్సా! ధర్మతనూభవా! వర్ణనాతీతమయిన నీభక్తికిసంతసించితిని. ధర్మచరిత్రులైన పుత్రులు తమతండ్రి సుగతికి జనుపుణ్యకర్మలజేయుట విధియైయున్నది. అందుచే నీవును తమ్ములును జననీయుతముగవారణాసికరిగి యందుఁ గొన్నాళ్ళునివసింపుచుఁబితృకార్యంబులఁ దీర్పుడు. వలసిన దానంబు లొనరుఁడు. ఇచ్చ

వచ్చినరీతి భూసురులను సేవింపుచు సన్మానింపుడు. భారతవర్షం బునందెల్ల పుణ్యక్షేత్రమై, శ్రీమదన్న పూర్ణాదేవీసమేతుఁడగు విశ్వనాథునకు నిలయమై, సకలసంపదలకును నాకరమై, పుణ్య జననివాసయోగ్యమై, సమస్తాభీష్టఫలప్రదమై, శ్రీమన్నారా యణుని చరణ కమలంబులందు జనించి, శంకరునిచే నిజజటా జూటంబున ధరింపఁబడి, పరమపావన తేజోవిరాజమానయైయొప్పు చుండు గంగామహాప్రవాహంబుచే నలంకరింపఁబడి భూలోక స్వర్గమై యొప్పుచున్న యా వారణాసీపురంబుననున్నచో మను జులకు సంతాపంబులు నశించి పుణ్యవంతులగుదురు.

ధర్మ—

సీ॥ ధరియించినీయాజ్ఞఁ ♦ దలపై నఁదమ్ములఁ
గూడిజననియైన ♦ కుంతితోడ
వారణాసినిఁజేరి ♦ భాగీరథినిగ్రుంకు
లిడుచుండి మేటిభూ ♦ మీసురులకు
దానధర్మంబులు ♦ దగినట్లుసేయుచు
నన్నపూర్ణాయుతుం ♦ డైనవిశ్వ
నాథుసేవింపుచు ♦ నేఁడు జనకునకు
బుణ్యకర్మలఁజేసి ♦ పొలుపుగాంచి
తే॥ గీ॥ వార్తఁబంపినయప్పుడు ♦ భవ్యమతిని
మరలనరుదెంచువాఁడ సో ♦ దరులఁగూడి

ధృత—ధరణి నినుమెచ్చవచ్చును ♦ ధర్మతనయ
తండ్రియానతినెఱవేర్పఁ ♦ దగుదువీవు
రమ్యగుణశాలియైన శ్రీ ♦ రాఘవునకు.

వత్సా! నీపితృభక్తిఁ బొగడఁజాలను. నీయిచ్చవచ్చిన తెఱంగున కాశీపురంబున దానధర్మములఁజేయుచుఁ జరింపుము. వలసిన ధనంబును

గొంపొమ్ము. మఱియు నీకెప్పుడెంత ధనము కావలసినను బంపు చుండెద.

ధర్మ—మహాప్రసాదము. (నిష్క్రమించును.)

ధృత—వత్సా! దుర్యోధనా! నీస్వాంతమునను న్నచింత పోయినదికదా. (సంజయునిఁజూచి) సంజయా! మందిరంబునకు దీసికొనిపొమ్ము.

(ధృతరాష్ట్రసంజయులు నిష్క్రమింతురు)

దుర్యో—సేవకా! సేవకా!

సేవ—మహారాజా! ఏమిసెలవు!

దుర్యో—కదురయుంబున నీవరిగి నాయాజ్ఞగాఁ దెలిపి పురోచనునిఁ దో డ్కొనిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

దుర్యో—ఎట్లో మాతండ్రిగారితోఁజెప్పి పాండవులను వారణావతంబున కరుగుమని చెప్పించితిని. వారికి సుముహూర్తము చూచుకొని వారణాసి కరుగుదురు. ఇప్పుడు నేనేపన్నుగడనైనను బన్ని వారినాపురంబున నంతంబొందింపవలయును. ఏయుపాయు మాలోచింతును? (ఆలోచించి) సరే! జ్ఞప్తికివచ్చినది. పురోచనునివలన నిక్కార్యము తప్పక నెఱవేరఁగలదు. అదుగో! పురోచనుండు వచ్చుచున్నాఁడు.

(పురోచనుఁడు ప్రవేశించును.)

పురో—(దుర్యోధనుని సమీపించి) దేవా! ఏమి యాజ్ఞ?

దుర్యో—మిత్రమా! పురోచనా! అరుదెంచితివా!

తే॥ గీ॥ బాల్యమాదిగ నాకునుఁ • బ్రాణ హితుఁడ
వగుచుఁ దనరుచుండుటను; కా • ర్యంబునొండు
చెప్పఁదలఁచి రావించితి • శీఘ్రగతిని
జెప్పుటకు సందియంబును • జెందుచుంటి.

పురో—దేవా! నీవు నా యొద్ద సందేహింపనేటికి! నే నెప్పుడును భవదాజ్ఞా బద్ధుడనని తలంపుడు. బాల్యంబాదిగ మీ యుప్పు పులుసు దినుచు జీవించు వాఁడనుగదా.

తే॥ గీ॥ చేయఁ గల్గిన కార్యంబుఁ • జేయువాఁడ
చేతగాకున్న నొరులను • చేయఁ జేతు
ప్రాణమిచ్చియున్న నిచ్చెదఁ • బార్థివేంద్ర
సందియుంబఁదఁ నేటికి • డెందమందు.

దుర్యో—సఖుఁడా! నీవు నా కార్యమును దప్పక చేయఁగలుగుదువు. దుర్ఘటమైన కార్యము కాదు; కాని యది బహు రహస్యము. రెండవ కంటి వానికిఁ గోచరము కాఁగూడదు.

పురో—మహారాజా! నన్ను గుఱించి నీ వన్యథా తలపఁవద్దు. ఎట్టి కార్యము జేయవలయునో చెప్పినచో గడు శీఘ్రముగాఁ జేయుటకీ సేవకుండు సంసిద్ధుఁడై యున్నాడు. సందియుంబందక సెలవిండు.

దుర్యో—పురోచనా! తండ్రి పోయిన నాటనుండియుఁ బాండవులు మా గృహంబునందే యుండి, మా కెగ్గుసేయఁ దలంపుచున్నారను మాట నీ వెఱుంగుదువా! లేదా!

పురో—కర్ణాకర్ణికగా విని యున్నవాఁడ.

దుర్యో—అది యట్లుండ మా తండ్రి ధర్మనందనుని యౌవరాజ్యపద మందుంచుట యెఱుంగుదువా.

పురో—ఎఱుంగుదును.

దుర్యో—ఆ కారణంబున వారు గర్వాంధకారచేతస్కులై తమ యంతటి పరాక్రమవంతులు లేరని తలంచి మా రాజ్యంబు నపహరింపఁ దలంచినారు,

పురో—

తే॥ గీ॥ తండ్రి పోయినవీక్షించి ♦ తమ్ముని సుతు
లంచుఁదలపోసి జాలి వ ♦ హించి యింటఁ
జేర్చినందుల కిబ్బంగి ♦ జేయువారె
తిన్నయింటను వాసాల ♦ నెన్నువగిది.

దుర్యో—ఆ కారణంబున నేను మా తండ్రితో జెప్పి యా పాండవుల ను పురంబు వెడల నడవఁజేసితిని.

పురో—ఏమీ! పాండవులు పురంబు విడిచిపోవుదురా! ఎప్పుడు.

దుర్యో—నామాట సంపూర్తిగ వినుము. వారొక వారము దినము లలో మా తండ్రిగారి యానతిని గాశీ పురంబునకుఁ బోవుచు న్నారు. కావున వారికంటె ముందుగ నీవా నగరంబున కరిగి నీ శక్తిచే ఘృతతైలగంధక ప్రిథితమైన చతుశ్శాలను నిర్మించి వారి రాకకై నిరీక్షించుచుండి వారరుదెంచిన వెంటనే యందు బ్రివేశపెట్టి వారితో స్నేహభావమునఁ గలసిమెలసివర్తింపుచుఁ గొన్నాళ్ళరిగినపిదప నర్ధరాత్రింబున వారు నిద్రమునింగియు న్నప్పుడుదాని కగ్నిఁగొల్పి, వారి మరణవార్తను నాచెవులకు వి నిపించి యానందముఁ గలుగఁజేయవలయును.

తే॥ గీ॥ అట్లొనర్చితివేని రా ♦ జ్యంబునాకు
వచ్చు; సకలసంపదలందు ♦ వాడ; దానఁ
జేసి నీవుగూడను బెక్కు ♦ శ్రీల; గాంచ
గంచువు యశమందుదువు నా ♦ కరుణచేత॥

నీవు నాకుఁ బ్రాణసముండవనియు, నిట్టి కార్యము జేయ నీవే సమర్థుండవనియుఁ దలంచి చెప్పితిని.

పురో—(తనలో) చతుశ్శాల నిర్మించుట నాకుఁ దృణప్రాయము. ఇట్టి కార్యము నేఁ జేసితినేని సుయోధనుండు నన్ను మెచ్చి యిచ్చు

వచ్చిన సంపదలతో నన్నుఁ దులదూఁగఁ జేయును. (ప్రకాశముగా) దేవా! ఇంతియేకదా నేఁ జేయవలసిన కార్యము. నీవు చెప్పినయట్లొనర్చి నీ కానందముఁ గూర్చెద.

దుర్యో—సఖుడా! నీవు పాండవులకన్న ముందుగా వారణాసి కరుగవలయును.

మ॥ కడువిశ్వాసివటంచు నీపయిన నీ • కార్యంబునుం బెట్టితిన్
వడిగాఁ జేరుము వారణావతము నీ • ప్రజ్ఞన్ గనన్ లక్కచే
డల నిర్మింపుము; వారిచావుఁగని వే • డ్కన్ వచ్చి విన్పింపుమీ
పుడమిన్ నీవె యొసంగినట్లుగ మదిన్ • మోదంబునుం బొందెదన్.

పురో—నేడే పోయెదను. ఆజ్ఞ యొసంగుము.

(నిష్క్రమించుచున్నాఁడు.)

దుర్యో—(తనలో) ఈపురోచనుఁడు తలఁచుకొన్నచో నెంతపనినైనను జేయఁగలుగును.

తే॥ గీ॥ పాండునందను లందరా • భవనమందు
దగ్ధులైనారటంచు నీ • తండువార్తఁ
చెవినిఁ బడవేసినప్పుడు • చిత్తమందు
గలుగు మోదంబు జెప్పంగ • నలవియగునె.

(నిష్క్రమించును)

[రంగము:—ధర్మ భీమార్జున నకులసహదేవులు కుంతి ప్రవేశించుచున్నారు.]

ధర్మ—తమ్ములారా!

తే॥ గీ॥ భాగ్యవశమున మనమిష్ట • వారణాసి
కరుగఁగంటిమి పెదతండ్రి • కరుణచేత

భీము— ఎంత ధర్మపరుండవో • యెంచిచూడ
కల్ల కపటంబులెఱుఁగవు • తెల్పతలంచి.

ధర్మ—ఆ పెదతండ్రిగారి ప్రీతి వర్ణింపఁ దరముకాదు. భూలోకస్వర్గ మనఁ పేరుపొందిన యీ కాశికి మమ్ములఁ బంపించుట నిశ్చయము గాఁ బూర్వ జన్మంబున మనమేదియో యించుక సుకృతము చేసికొని యుండుటచేతనే కలిగినది.

తరల:——ఘనముగానల వారణాసిని ♦ గామసంహరనీశునిఁ
గనెడిభాగ్యము గల్గెనేటికి ♦ గంగయాదునమున్గి యీ
తని పదంబులఁ గొల్చువారికి ♦ ధారుణీ తలమందున
మ్మనమునిశ్చలమౌచునొప్పును♦మాన్యతఁ వహించుంతురిగా.

కుంతి——వత్సా! ధర్మతనూభవా! నీవెంత వెఱ్ఱివాడవోయి! నిజముగా మీ పెదతండ్రియగు ధృతరాష్ట్రుండు మనపైఁ బ్రేమయుండుట చేతనే యిట్లు వారణాశికిఁ బంపుచుండెనని తలంపుచుంటివా!

ధర్మ——తల్లీ తమ్మునికుమారులమని తలంచి నిరంతరమును మమ్ములను కంటికి రెప్ప చందంబునఁ గాచుచున్న పెదతండ్రియగు ధృతరాష్ట్రుండు మా తండ్రికి గాశీ నగరంబునఁ గొన్ని పుణ్య కర్మలను జేసి రమ్మని పంపుచుండగా నీ విట్లు పక్కాణించెదవేల!

కుంతి——కుమారా! నిజముగా ధృతరాష్ట్రుండు మీయందుఁ గరుణించి పంపుచుండుటలేదు. దుర్యోధనాదుల దుర్మంత్రంబునకుఁ బద్ధుఁడై యీ రీతి గావించెనని నాకుఁ దెలిసినది. కాకున్నచో నింత బాల్యావస్థయందు మీకుఁ దీర్థ యాత్రా సంచరణమేమిటికి?

ధర్మ——మనకిప్పుడా విషయంబునుగూర్చి యాలోచింప నవసరములేదు. ఏల యనిన,

తే॥ గీ॥ పోవనున్నది కాశికా ♦ పురికినిపుడు
స్నాన మొనరించునది గాంగ ♦ జలములందు

సలుపనున్నది తండ్రికి • సంతసమున
బుణ్యకర్మలు ; దీనికిఁ • బొగలనేల.

ఒకవేళ పెదతండ్రి దుర్యోధనాదుల దుర్మంత్రంబున మనలను బంపినను మనకుమాత్రమిందు మహోపకారము చేసినాడు.

తే॥ గీ॥ జీవహింసను నిరతంబు • జేయువాఁడె
యైనఁ ; బరకాంతలనుగోరు • నతఁడునైన
ననిమిషనదీ ప్రవాహంబు • నందు గ్రుంకు
లిడిన పాపదూరుఁడగుచు • నెగడునమ్మ.

అర్జు—తల్లీ !

తే॥ గీ॥ పరుల తల్లులు బెట్టెడి • పాయసంబు
కన్నఁ ; గన్నతల్లి యిడెడు • గంజిమేలు
వైరి గృహమందు వసియించి • భాగ్యమందు
కన్న ; యాచనమేలౌను • గాదె జగతి॥

మనలకు నిరతంబును సిగ్గుసేయఁ దలపెట్టు ధార్తరాష్ట్రుల గృహంబున నుండుటకన్న వారణావత నగర నివాసమే మనకు సౌఖ్యదాయకము. మఱియు, నే మహాపురంబఖండనవఖండకలిత భూమండలంబునకెల్ల యాభరణమై యొప్పుచున్నదో, ఎద్దానియందు స్నాన మాచరించుచున్నచో దుఃఖములుపోయి, పాపంబులణగంటి, యజ్ఞానమునశించి, విజ్ఞానమొనగూడి, యధిక తేజంబు గలిగి, చిత్తంబునకు వికాసము గలుగునో యట్టి భాగీరథి యేపురంబున బాఱుచుండునో, భక్తజనులయభీష్టంబుల దీర్పదలంచి సతీసమేతుఁడై విశ్వనాథుఁడను నామంబున యేపురంబున శంభుండు నెలకొనియుండెనో, శతయోజనంబుల దూరంబున నుండి యైనను తమ తపోయోగ బలంబుసంజేసి, తెల్లవారఝామున కోడి కూసినప్పు డరుదెంచి గంగాస్నాన మాచరించి మరల సూర్యోదయంబునకు బూర్వము తమ కుటీరము లకుజేరు మునీంద్రులేపురం

బునఁగన్పట్టుచుండురో, శ్రీకాశీవిశ్వనాథ చరణారవింద మకరం పానమత్తేందిందిరాయమానమానసన్మానసులును, నిరంతరచతుర్వేద పారాయణ భాసురులును నగు భూసురులును, వైరివీరదర్పాంధకార ప్రభాకరులగు క్షత్రియకుమారవారంబును, ధనకనకవస్తువాహన శోభితులగు వైశ్యులును, అక్షుద్రభద్రేతర శాశ్వతైశ్వర్యసంపత్సముద్రులగు శూద్రులును, జవవిజితపవనమనోవేగరంగత్తురంగంబులును, మత్త సామజంబులును, పసిఁడితేరులును, ననేక దేవాలయంబులును గలిగి శోభిల్లుచున్న వారణావతంబు మన కెంతయు నివాసయోగ్యము. అమ్మా!

చ॥ మనుజులు నిరంతరంబు జెను • బాముల గూర్పఁగ నోచుచుండు దు
ర్జనుఁడసనట్టి చోని సర • సన్ నివసించుచుమంటకన్న; దు
స్తరకలుషంబులార్పగను • జాలినగంగ యుమండి; పార్వతీ
వరునకు వాసమైనయది • పట్టణమందున నుంటయొప్పదే.

సహ—అమ్మా! నీవింక ధార్తరాష్ట్రులసంగతి నెత్తకుము. అచ్చట నుండుటకన్న మనకు గాశికాపురనివాసమే శ్రేయోదాయకమని తలంపుము.

నకు—అదుగో! విదురుండేటికో యిట్లు వచ్చుచున్నాఁడు.

ధర్మ—ఈతఁడు నిరంతరంబును మనక్షేమ మాలోచించువాఁడు.

[విదురుఁడు ప్రవేశించును.]

విదు—(తనలో) భగవంతా! పరమేశ్వరా! నీచర్య లతివిచిత్రములు

మ॥ ధనికున్ బేదగ బేదనున్ ధనికుగా • ధర్మైక సంవేద్యు దు
ర్జనుగా! దుర్జనుఁ ధర్మ తత్పరునిగా • సత్యవ్రతున్ హీనుగా
ఘనశక్తున్ ధరసిందద్రజాలకుగతిన్ • గావింపుచున్నావు నీ
ఘనమెవ్వారు గణింపగశక్తులు సుధ • ర్మాంబోధి చంద్రోదయా,

తే॥ గీ॥ భాగ్యముండెనుమాకంచు • భావమందు
గర్వమునుబూనువారలఁ • గరుణలేక
బిచ్చమెత్తంగఁజేతువు • వేడ్కతోడ
కరుణగలిగిననిరుపేద • ధరణినేలు.

అదిగో పాండవులుఁ ప్రయాణోన్ముఖంబున నున్నవారలు.

ఉ॥ పాండుకుమారులన్ గనినఁ • బాండునిజూచినయట్టులుండెఁ; నా
ఖండలభాగ్యభోగముల • గాంచఁగఁజాలిన వీరినెట్లుభూ
మండలనాయకుండుపురిఁ • బాసిచనంగను జేయగల్గెఁ బు
త్రింతువచించువాక్యములఁ • ద్రోయకఁ బ్రేమద్యజింపుచుఁగటా.

ఏమనుకొన్న నేమిప్రయోజనమున్నది. విధివ్రాతఁదప్పింప నెవ్వరితరమగును. ఇదిగో పాండవులు. (పాండవులను సమీపించుచున్నాడు.)

ధర్మ—(విదురునిఁజూచి) విదురా! నీరాక మాకిప్పుడు శుభప్రదమని తలంపుచున్నాము.

అర్జు—మాకెగ్గులసల్పఁదలంచు పాండవులపక్షంబునందుండినను నీవు నిరంతరంబును మాక్షేమంబును, యభివృద్ధినిగోరుచుందువు.

విదు—పాండుతనూజులారా! నిజముగాఁ దలయెత్తి మీతో భాషించుటకు నాకు మిగులఁ లజ్జయగుచున్నది.

నకు—మహాత్మా అట్లు పలికెదవేమి?

విదు—మరేమియును లేదు.

తే॥ గీ॥ కాశి కరుగుమంచునుమీకు • తా్మధవుండు
పలుక నినుమంతయేనియు • వలదటంచు
నతనితోఁజెప్ప లేనైతి • నకట; వృద్ధుఁ
డైన భీష్ముఁడే సైరించె • ననుచుఁ దలఁచి॥

ధర్మ—నీతికోవిదా! విదురా! ఇందు మాకు గష్టమేమున్నది. పూజ్యులగు మా పెదతండ్రిగారు మాయందున్న ప్రేమచే మమ్ములను వారణావతంబునకు బంపుచున్నారు. అయ్యది పుణ్యక్షేత్ర మగుటంజేసి జపతపాది పుణ్యకర్మంబుల నాచరించి సత్వరముగానే మరలివత్తుము. మాయందు మాత్రము నీవు సంపూర్ణమైన యనుగ్రహముంచుము.

విదు—ధర్మపరాయణులగు నో పాండవపుత్రులారా!

తే॥ గీ॥ ఎచటమీరుందు రచ్చోట ♦ నిందిరాధ
వుండలరుచుండి; దప్పక ♦ నిందుముదము
మీఱు; మీకునశాంతము ♦ మేలుఁగూర్చు
స్వాంతమందుననున్నట్టి ♦ చింతఁబాపి.

శ్రీహరి కరుణావర్షిష్ణులగు మీకెందున్నను శుభములే గలుగుచుండును. అయినను దినములుఁ దప్పివచ్చినప్పుడు కాలంబున కొదిగియుండవలయును. ఇంక నొక్క సంగతిఁ గూడ మీకుఁ జెప్పవలసియున్నది.

తే॥ గీ॥ కడుఁబరాక్రమమున్నటంచు ♦ గర్వమూని
సంచరింపఁగఁబోకుఁడు ♦ క్ష్మాతలమున
జాగరూకులై యుండుఁడు ♦ జలమునందు
నగ్ని సైత్రంబునందున ♦ ననఘులార.

ఇంతకంటె నేఁ జెప్పవలసిన దేమియును లేదు. పితృవాక్యపరిపాలన జేయఁదలంచి వారణాసికరుగుచున్న మీరు సుఖముగా మరలివచ్చుటకుఁ బరమేశ్వరుని నశ్రాంతంబును బ్రార్థింపుచుందును. ఒకవేళ దుర్యోధనుం డేవియైనను మాయోపాయంబులు మీయెడల బన్నెనేని రహస్యముగ నవ్వార్తల మీకెఱింగింపుచుండెదను. వాటికిదగిన ప్రతీకారంబులు మీరాలోచించుకొనుచు జాగరూకులై యుండుఁడు.

ధర్మ—

తే॥ గీ॥ నమ్ముదో లేదొ గాని మా ♦ నెమ్మనములఁ
దండ్రివలెనిన్నుఁ జూతుము ♦ ధన్యచరిత
యట్లె నీవును మాదుసౌ ♦ ఖ్యంబుఁ జూచు
చుండెదవ హర్నిశంబును ♦ నింతుప్రేమ.

పితృసమానా ! విదురా ! దయయుంచుము.

అర్జు—దుష్టులగు కౌరవుల పన్నుగడలను మాకెఱింగింపుము రక్షించు భారము నీయది.

విదు—మీ నావిషయమై యేమియు భయంబును సందియంబును బొందవలదు. ఇంక నేసరిగెదను. (నిష్క్రమించును)

ధర్మ—మనకు పితృసముండును నిరంతరంబును మన శ్రేయస్సు కోరువాడును నగు విదురుండు వచించినపలుకులు వింటిరికదా. కావున మన మతిజాగరూకతతో వారణాసియందు మెలఁగవలయును. మరియు నమ్మహాత్ముండు మనయందుఁగల కరుణంజేసి దుర్యోధనాదులు మనయెడల నెట్టి దుస్తంత్రములనైన బన్నుచుండినచో నయ్యవి సమయమునుజూచి యెవ్వరిచేతనైన రహస్యముగ వార్తఁ బుత్తెంచుచుండెదనని చెప్పియున్నాఁడు.

నకు—విదురునిమాటలుచూడగా దుష్టసుయోధనుండేదియైన మాయ మనవిషయమై పన్నునని తోఁచుచున్నది.

సహ—వారెట్టిమాయలుపన్నినను నన్నగారిధర్మంబే మనలను నిరంతరంబును రక్షింపుచుండును

అర్జు—మనకుఁ గాలాతీతమగుచున్నది. నెమ్మదిగా బోవుదమురండు.

(అందరును నడచుచున్నారు)

[తెరలో]

ఓహో! ధర్మచరిత్రులైన యోపాండురాజనందనులారా! పోకుఁడు. పోకుఁడు మేముగూడ మీవెంటవచ్చెదము.

ధర్మ—తమ్ములారా! పౌరులు కాబోలు యాక్రందనముఁజేయుచు నిట్లువచ్చుచున్నారు! వీరినెట్లయిన సామవాక్యంబులచేఁ బురంబునకు మరలిపోవునట్లు జేయవలయును.

[పౌరులిరువురు ప్రవేశింతురు.]

(పాండవులనుజూచి)

ప్రథ—

తే॥ గీ॥ పాండుసుతులార! మిమ్ముల ♦ బాసిమేము
నిల్వగాఁజాలమిచ్చోట ♦ నిక్కముగను
జలవిహీనమైయొప్పెడి ♦ సరసిపోలె
యొప్పనీపురిమీరు లే ♦ కుంటఁ జేసి.

అక్కటా! దుష్టచరిత్రుఁడగు దుర్యోధనుఁడా? మమ్ము పరిపాలించుట?

ద్వితీ—అయ్యో! పుణ్యమూర్తులగు పాండవులారా! మిమ్ము కారణంబుగ గాశీయాత్రియను నెపముపెట్టి దుర్యోధనుని మాటల నాలించి పురము బాసిపోవునట్లు గావించెనా?

సీ॥ పెట్టిపోయుమటంచు ♦ బిచ్చమెత్తఁగ లేము
దయ లేకపురినుండి ♦ తరుమ నేల
సంపదలిమ్మంచుఁ ♦ జాలఁగోరనివారి
నీరీతిగావించి ♦ యొగడనేల
జనకుఁడీతండని ♦ మనసునందెంచి సే
వించుహారికిసెల్లు ♦ లెంచనేల

తండ్రిభాగము నక్రై • దండెత్తియెఱుగని
వారినీభంగిఁ బం • పంగనేల

తే॥ గీ॥ అక్కటా యంధభూపతి • యాత్మజాతు
కుటిలవాక్యంబులాలించి • కుమతియగుచు
నిట్టికష్టంబులనుదెచ్చి • పెట్టినాడె
దాన ధర్మచరితులౌచుఁ • దనరుమీకు.

రాజా! ధర్మ తనూభవా! రామ రాజ్యము వలె నుండు నీ పరి పాలనంబున గడువులో జల్లకదలకుండ నుంటిమి. మిమ్ములను బాసి మేమీ రాజ్యంబున నిల్వజాలము.'

సీ॥ యమదండనకు నర్హ్యుఁ • డౌ యపరాధినిఁ
బల్లెత్తి మాటాడ • నెల్లవెతి
సేవకుండైనను • జెందునో శ్రమయంచు
నేపనిఁజెప్ప స • హింపవైతి
వీరుండసనివిట్టి • వీగెడి రిపునైన
నెట్టగాఁ జూచుటే • యెఱుఁగవైతి
భూదేవతాపాద • ముల సేవనెప్పుడు
మానసవీడని • మఱువవైతి

తే॥ గీ॥ వట్టి ధర్మమూర్తి వగుచు • నలరునిన్ను
బంపుటకు నెట్టులొప్పెను • పార్థివుండు
గర్మమిట్లుండె భువిని న • ఘంబు పండె
సత్యగుణసాంద్ర ధర్మజ • సన్నుతేంద్ర.

మహారాజా! ఇంక బలుమాటలతో నేమి పనియున్నది. మ మ్మాటికినిఁ జెప్పుచుంటిమి. మీ రు లేని యీ పురంబున మేముండజాల ము. మిమ్ములను గొల్చుచు మీ వెనువెంట నరుదెంతుము. మ మ్ము విడి దప్పక గొనిపొమ్ము.

ధర్మ——పౌరులారా! మీరుధృతరాష్ట్రుని దూషింపనలదు. వారుమా కుఁ జేసిన యుపకార మేమియును లేదు. మా తండ్రిగారికి బుణ్యకర్మల జేయుటకు వారణావతంబున కరుగుచున్నాము. అయ్యది పూర్తియైనంతనే సత్వరము నరుదెంతుము. సుయోధనుండు మా యెడల నట్టి బుద్ధిబూని యుండెను గాని రాజ్య పరిపాలనంబునందు గడు సమర్థుండు, మాకు దడవగుచున్నది. మేమరిగెదము.

ద్వితీయపౌ——

క్రొంచపదము.

హా నృపతీ! యాలింపుమిదే నీ యడుగులఁగొలచుచు ననిశమునీతో మానకగారీ వాసముసేయన్ మనమున దలచితి మగణితలీలన్ మానసమందున్! సంశియామింకన్ బడగనుదగదిటు మహితచరిత్రా దీనజనాధారా! గుణవీరా తిరమగఁ గొనిజను దినకరతేజా.

ధర్మ——పౌరులారా! నామాట లాలింపుడు. మీరన్యథా తలంపవ లదు. మేము వారణాశి కరుగు కారణంబు మీతో జెప్పియే యుంటిని. మిమ్ము నా వెంట గొనిపోయితినేని మున్నే మా మాటలుయన్న నసహ్యపడు సుయోధనునకు మఱింత యా గ్రహము కలుగును. అదియునుగాక పౌరులనెల్లర దనవెంట దోడ్కొనిపోయెనను నిందాభరము నా తలపై బడును. కా వున మీరు పురంబునకు మఱలుడు.

ప్రథమ——ధర్మపుత్రా! నీవట్లు వచియింపుచుండ మే మేమనగలము. నీయాజ్ఞ ననుసరించియే వర్తించెదము. పునర్దర్శనంబు త్వర లోనే యగునుగాక! (నిష్క్రమింతురు.)

ధర్మ——తమ్ములారా! ఇక్కడికే యాలస్యమయినది. సత్వరముగా బోవలె రండు. (అందఱును నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.



శ్రీ

# ద్రౌపదీపరిణయము.

## ద్వితీయాంకము.

రంగము:—వారణాసి.

[ప్రవేశము. ఒక బ్రాహ్మణుఁడు.]

బ్రాహ్మ—(తనలో) హా! పరమేశ్వరా! ఎంతలో నెంతపనిఁ గావించితివి. ధర్మపరాయణులై వారణావతంబుననున్న భూసురులకింత యాధారము కలుగఁజేయుచున్న పాండుతనయుల కకారణమరణంబు గల్పించితివా? ఆ ధర్మపరాయణులను, నా దానవ్రతాచార పారీణులను, నా సత్యసంధులను, నా భవనంబున దగ్ధులగునట్లుజేయ వారు నీకేమి యుపకారమాచరించిరి? (దుర్యోధనునుద్దేశించి) దుష్టదుర్యోధనా! ఇప్పుడు నీ కళ్లు చల్లబడినవా? ఆ పాండవులు నీవు పన్నిన మాయఁ గనుంగొనలేకపోయిరిగదా. చంచలంబైన రాజ్యలక్ష్మికై యాసఁజెంది యెట్టి దుష్కార్యము గావింపఁజేసితివి. (పాండవుల దలఁచి) హా! పాండునృపాలనందనులారా! మీరిచ్చోటి కరుదెంచిననాటనుండియు బ్రాహ్మణుల తపంబులు పండినవి. మీ దయారసంబున మేము భాగ్యవంతులమై భార్యాబిడ్డలను బోషించుకొనుచుంటిమి. బ్రాహ్మణపక్షపాతులగు మీరు చిరకాలమీ భూమిపై వర్ధిలుదురని తలఁచితిమి గాని యిట్లగుదురని గలనయినఁ దలఁపమైతిమి.

మ॥ సకలోర్వీశ కిరీటరత్నరుచి భా • స్వచ్చారుపాదాబ్జులై
సకలద్వీప సముద్రముద్రిత మహీ • చక్రంబు బాలింపు మ
త్సుకృపా దీనులనేలువారమను సం • తోషింపుచుండగ; న
ష్టకుపుత్రాన్వితభూ మాతులోమునింగి క • ష్టా! ప్రాణముల్ వాసిరే.

(ఇంచుక యూరకుండి) నిరంతరమును బరమేశ్వరారాధన తత్పరులగు వారికీతి సంతంబు సందమరాయని సందియము గలుగుచున్నది. (ఆలోచించి) అయ్యో! నేనంత వెఱ్ఱివాడనై యాలోచింపుచుంటిని. చతుశ్శాలాభవనంబున దగ్ధులైన యేవురు పురుషులయొక్కయు నొకవనిత యొక్కయు కళేబరంబులు స్వయముగాం జూచియు నిట్లు దలపోయుచుంటిని. అయినను దగ్ధమైపోయిన యా లక్కమందిరంబుకడకరిగి ప్రజ లేమని చెప్పకొనుచుండిరో వినెదనుగాక.

(నిష్క్రమించును.)

[రంగము:—హిడింబాసురుని వనము:—భీమరక్షితులై ధర్మార్జున నకుల సహదేవులు కుంతియు నిద్రింపుచుందురు.]

భీము:—(తనలో విదురుని నుద్దేశించి) ఆహా! విదురా! నీవెంతటి సత్కృపాశాలివి. రిపుపక్షమున నుండినవాడవయ్యును, మాయెడల నెంతప్రేమఁగనంబఱచితివి.

తే॥ గీ॥ అంటుకొన్నట్టి యాలక్క • యింటినుండి
భవ్యభవదీయకరుణచే • బయటబడితి
మయ్య కాకయుండిన దుష్టుఁ • డైనకౌర
వాగ్రజునిమాయఁ దెలియంగ • నగునెమాకు.

నిన్ను నిశ్చయముగాఁ బ్రాణదాతవని చెప్పవచ్చును. ఆనాఁడు నీవు ఖనకునిచే నిట్టివార్త బంపకపోయినను, నాతండు మమ్ము రక్షించుటకు బిలంబు నేయక పోయినను మేమీపాటికి శోకంబును విడిచిపెట్టవల

సిన వారమగుదుముకదా ? (ఇంచుకయూరకుండి సుయోధను నుద్దేశించి) ఓరీ ! దుర్మతీ ! సుయోధనా ! ఇట్టి దుష్కార్యము జేయుటకు నీకు మేమేమి యపకారమాచరించితిమి.

తే॥ గీ॥ ఎవ్వఁ డైనను రాజ్యంబు • నిమ్మటంచు
గాని ; సంపద్దలిమ్మంచుఁ • గాని నీదు
తండ్రిఁ గోరియుంటిమె మేము • ధర్మహీన
యేల చేసితి వీపని • హీనబుద్ధి.

క్రూరుఁడా ! మాయోపాయంబులం జంపనెంచు టదియేటిపౌరుషము. ఇదియేనా నీశౌర్యము. ఎవ్వరైనను నవ్వుదురనియైనను దలంపకపోయితివా ?

శా॥ లేరే పెద్దలు నీకుబుద్ధిఁ దెలుపన్ • లేకుందురే యాప్తులన్
వారిం జేరవొ ; ధర్మమార్గనిరతిన్ • వాంఛింపవో ; గానిచో
క్రూరత్వంబునఁ బూని చిత్తమున నా • కున్ గీడు సేయంగ నే
లా ! రా రాజువునయ్యు నీవిటు సను • వ్యద్బుద్ధిహీనుండవై.

ఓరీ ! కౌరవకులపాంసనా ! నీమాయోపాయంబుల విడిచి యెదుటకురమ్ము, కయ్యమొనరింపఁదలంచిన వాఁడవేని యట్లుసేయుము.

ఉ॥ ఓరి దురాత్మ యూఁగక మ • హోగ్రపుమాయలు సేయనేటికిన్
ఘోరరణంబు సేయఁగ న • కుంఠితలీలను రమ్ము నిన్ను నా
ధారుణిఁ ద్రెళ్ళనేసెదను • తమ్ములతోడను గూడ ; సర్వభూ
దారులు వీనుచచ్చెనని • తద్దయుమోదము నందునట్లుగన్.

(ఇంచుకయూరకుండి) కాలముదాటుట కెవ్వరును శక్తులుగారు గదా ! (జననీ సోదరులఁజూచి) మీరందఱును సంపూర్ణమైన నిద్రయందు మునింగియున్నవారు (ధర్మరాజునుద్దేశించి)

మ॥ ధరణీపాల శిరస్తటీమకుటస • త్కారంబునన్ మించు భూ
వరచంద్రుండు ; యుధిష్ఠిరుండకట స • ద్భాగ్యంబులం బాసి భీ

కరశార్దూలమృగంబు లెల్లయెడలన్ గన్పట్టుచున్నోట సో
దరులం గూడి మునింగె నిద్దురను ధాతా! యెంతవ్రాసితో.

(అర్జునునిం జూచి)

ఉ॥ దివ్యను శత్రుబృందమును జెండగజాలిన యస్త్రవేత్త బల్
మవ్వపురూపువాఁడు జన మాన్యచరిత్రుఁడు సద్గుణుండు నా
కవ్వడి తాపమున్ మునిఁగి కంటక సూక్ష్మశిలాతలంబునం
దెవ్విధిఁ బండగాఁగలిగె నేమనిదూఱుదు ధాతవ్రాతలన్.

(నకులసహదేవులనుజూచి)

కం॥ ఎండనుగన్నులఁజూడక
నుండెడిమాద్రీవరసుతు లుగ్రాటవిలోఁ
జండరవంబులకోర్చియు
బండిరి దేహము లెఱుఁగక బాధ్రబ్ధగతిన్.

(కుంతినిజూచి) ఓతల్లీ! బలపరాక్రమశౌర్యవంతులగు నేవుర కుమారుల గల్గియుండియు, నీవెట్టి యిక్కట్లపాలయితివి? ఆహా!

ఆ॥ వె॥ కుంతిభోజుపట్టి గోవిందుమేనత్త
పాండునృపునిపత్ని పాపరహిత
మృదులశయ్యలయందు నిదురవోయెడుదేవి
గాఢసుప్తినందెఁ గటికనేల.

అక్కటా! ఎట్టియిడుములబడవలసివచ్చినది. ఇట్లగునని యెన్నఁడైనను గలలోనైనఁ దలంచియుంటినా. (దైవమునుద్దేశించి) హా! ద్వారకావాసా! కృష్ణా! దీనచింతామణీ! నిరంతరము మమ్ము రక్షింపుచుండు దాక్షిణ్యశాలివైన నీవుగూడ యిప్పుడు మాయెడల నిర్దాక్షిణ్య మేలవహించితివో తెలియకున్నది.

శా॥ దేవా! మాయెడనీకటాక్షమును బ్రీతింజూపి బాహాటమౌ
నీవాత్సల్యముచేత ధారుణిపు మా నేరంబులన్ దిద్ది మా

భావంబందు వసింపుచుండి ఘనతా • పంబార్పుమీ మ్రొక్కెదన్
నీవే దైవమటంచు మందలంచి తం • డ్రీ! బంధుచింతామణీ.

శా॥ వేదామోదిత విశ్వసంభరిత శ్రీ • వేదాంతవేద్యా హరీ
రాదా! నీదయ మాపయిన్ గుణమణీ • బ్రహ్లాదు నింగావగా
లేదా! మున్ను భవత్కటాక్షమునఁ గా • లిందీమహావల్లభా
రాదా! మమ్ముల బ్రోవగల్గినమొకన్ • భక్తౌఘ చింతామణీ.

కవిరాజవిరాజితము.

ఖలుఁడగు నాధృతరాష్ట్రుని పుత్రుఁడు • కల్పనజేసిన మాయలనున్
దెలియఁగజాలక మందిరమందున • దిన్నగ వాసము సేయగనున్
చలమున నాతఁడు మమ్ముల నందర • జంపఁదలంపుచు దానికిన్
గనువసియగ్నినిఁ బెట్టకదప్పక • గ్రన్నన జేసితి యిచ్చటికిన్.

ఓ! మహానుభావా! ఆపద్బాంధవా! మాయందు నీకుఁగరుణలేక పోయినను కుంతి నీకు మేనత్తయగుటం జేసి, యామెను జూచియైన మమ్ము రక్షింపుము.

విచారలహరి.

దేవ దేవ దేవరా • బ్రోవరమ్ము శ్రీవరా ।
భావమందు నిన్ను నే • గావవేడుచుంటిగా ॥
చిన్ననాటనుండినిన్ • నన్నిమీఁదగొల్వఁగా ।
జన్నిబ్రోవకుంట యు • న్నన్ననీదు దాసులన్ ॥
క్రూరబుద్ధిబూని యా • కౌరవేంద్రుఁడక్కటా ।
ఘోరసంకటంబులన్ • గూరుఁడై యొనర్చెడిన్ ॥
పంతమేలనీకు శ్రీ • కాంత! యిప్పుడిట్లు మా ।
చింత వేగదీర్పఁగాఁ • జెంత జేరుమా హరీ ॥

(ఇంచుకయూరకుండి) ఆహా! వీరందఱును దీర్ఘనిద్రాపరవశులై యున్నారు. 'నిద్ర సౌఖ్యమెఱుఁగ' దను వాక్యము నేటికనుభవమునకు

వచ్చినదిగదా. సప్తద్వీపసముద్రముద్రితమహీసామ్రాజ్య భారంబును దనదోఃపీఠిని నిల్పఁజాలిన యీధర్మచరిత్రుఁడైన యుధిష్ఠిరుండు తమ్ములతోఁగూడ కఠినపాషాణయుతమైన యీ వట్టినేలఁబండు తన బాహువులే తలగడలుగాఁ జేసికొని శరీరము మఱచి నిద్రించుచున్నాఁడు. కుంతిభోజునకుఁ గారాబపుపట్టియై, సద్గుణభావుండగు వసుదేవునకు జెల్లెలై, సర్వజగత్కర్తయగు శ్రీకృష్ణునకుఁ మేనత్తయై, భరతకులప్రదీపుడైన విచిత్రవీర్యునకు గోడలై, యరిరాజ భయంకరుండును, విమలగుణుండును, సత్యసంధుండునునగు పాండురాజునకు భార్యయై, దేవతావరప్రసాదంబున జనించిన దుర్వారబలులగు నేవురతనయులకుఁ దల్లియై, యెండకన్నను వానకన్నను నెన్నఁడును నెఱుంగని యీకుంతి యిట్టి ఘోరకాంతారమున శయనించు మస్థితిబట్టెనుగదా. విధికృత మెవ్వరు దప్పింపఁగలరు? (ఇంచుక యూరకుండి) నాకేమియోగాని దాహము మిక్కుటముగ నగుచున్నది.

"ఉ॥ వాయుతనూజ ? లక్కయిలు ♦ బాపి విపద్దశనందకుండ మ
మ్మిమ్మొమెడ కెత్తి తెచ్చితివి ♦ యిప్పుడు దాహము గొంటిమయ్య బల్
శ్రేయములెందునైన గఁడు ♦ దొందరగా గొనివచ్చి బ్రోవుమీ
యీయమడస్పియున్నయది ♦ యాకవలుల్ బిలువంగఁబల్కరే."

అని అన్నగారు వచించియు నిద్రను జెందినారు. అల్లదిగో యెదుటగా నొక కాసారంబుఁ గనుపట్టుచున్నది. నా దాహముదీర్చుకొని, వలసిన సలిలంబులుఁగొని తెచ్చియుంచెదను. వీరు నిద్రలేచినపిదప ద్రావుదురు.

(నిష్క్రమించును.)

(తెరవాలును.)

---

రంగము:—హస్తినాపురమున ధృతరాష్ట్రుని మందిరము.

[ప్రవేశము—దుర్యోధనుడు:—]

దుర్యో—(తనలో) ఆహా! 'తానొకటితలచిన దైవ మింకొకటిచేయు' నను పలుకులు సత్యమైనవిగదా. (పురోచనునుద్దేశించి) మిత్రమా! పురోచనా! నీకెట్టివిపత్తువచ్చినది.

తే॥ గీ॥ నాకు నుపకృతిసేయ మ ♦ నంబునందుఁ
దలచి; వారణాసికిఁబోయి ♦ దైవవిధిని
లక్కయింటను దగ్ధమై ♦ సురికి...నావె
పాండుసుతుల ప్రాణంబులఁ ♦ బాపి సఖుఁడ.

అక్కటా! నీమృతికి నేనే కారణంబుగదా. పాండవుల మరణ వార్త నీవు స్వయముగా వినిపించి నాచే సత్కృతిబడయుదువని నిరీక్షింపుచుండగాఁ, బిట్టపిడుగువంటి యీవార్త నాచెవినిఁబడెను. అయ్యో! దాయలగు పాండవేయులు మృతినొందనను నీవు లేకుంటచే నాకంత సంతసము గలుగకున్నది.

[కర్ణుఁడు ప్రవేశించును.]

కర్ణు—(తనలో) ఇదుగో! రారాజగు దుర్యోధనుం డిచ్చటనే యున్నవాఁడు.

(సమీపించును.)

దుర్యో—మిత్రమా! కర్ణా! అరుదెంచితివా!

కర్ణు—నీకై నీమందిరంబున కరిగితినిగాని యచ్చటలేకుంటచే నిట్లు వచ్చితిని. (ఇంచుక యూరకుండి) కౌరవేశ్వరా! నీముఖము నేఁడేలనోగాని విచారమున కాటపట్టయియున్నట్లు గానిపించుచున్నదే. కారణం బడుగవచ్చునా.

దుర్యో—మిత్రమా! ఏమనిచెప్పుదును?

తే॥ గీ॥ పాండవుల నెట్టులైనఁ జం ♦ పంగఁదలఁచి
లక్క యిల్లు నిర్మించిన ♦ మొక్కలీఁడు
మన పురోచనుఁడు; సఖుఁడు ♦ మాన్యగుణుఁడు
పావకజ్వాల లంటున ♦ భస్మమయ్యెఁ.

కర్ణ—ఏమీ! పురోచనుం డగ్నిహోత్రుని కాహుతియయ్యెనా! అదియెట్లు.

దుర్యో—లక్కయింటి కగ్నిఁబెట్టి తప్పించుకొనలేకపోవుటచే మడిసెనని తలంచెదను.

కర్ణ—పాండవుల సంగతి యేమైనది.

దుర్యో—వారునుఁ బురోచనుని మార్గమునే బట్టిరి.

కర్ణ—అక్కటా! పాండవేయులు మడిసిరా? (ఇంచుక విచారించును)

దుర్యో—మిత్రమా! పాండవుల మరణము నీకు విచారంబును గొలుపుచున్నదా!

కర్ణ—

తే॥ గీ॥ వారు నీమూలమున నాకు ♦ వైరులయ్యు
నేమి కారణంబోగాని ♦ మెఱుఁగుఁజాల
వారిజూచిన సోదర ♦ భావమమరె
నంటుచేతను యొక్కింత ♦ డెందమందు
చింత జనియించె నాకును ♦ క్షితిత లేంద్ర.

(తనలో) ఏవురు పురుషులును నొక్క వనితయు నా చతుశ్శాలా దావానలజ్వాలల దగ్ధులైరని వింటిని గాని యీ మరణించినది యింక నెవ్వరో యై యుండును. నిరంతర శ్రీకృష్ణ కృపావర్ధిష్ణులగు వారి క పాయంబులు వాటిల్లునని నాకు దోచదు. ఆ భీముండీ సుయోధనుని

కన్న గదు మాయోపాయ దురంధరుఁడు. వాసుదేవుని దయచే వా
రీపాటి కెక్కడనో సురక్షితులై యుందురనియే నానమ్మకము.

దుర్యో—మిత్రమా! నీ వెంత దయార్ద్రహృదయమోయి. శౌర్యవంతులకిదియేనా లక్షణము. ఇట్టివాడవు సంగరంబున నేవిధంబునఁ జరింతువో తెలియకున్నది.

కర్ణ—కరుణ గలిగినవానికిఁ బగవాఁడు మడిసెనన్నను జాలిపుట్టునుగదా. కొండొక కారణంబున మీకును వారికిని వైరముగల్గినను మీకుఁ బినతండ్రి పుత్రులుగదా.

దుర్యో—తే॥ గీ॥ సంతతంబును నుండెడి ♦ సమయమందు
చిత్తమందునఁ జింతను ♦ జేర్చ నేల
నేల నిష్కంటకంబుగ ♦ నేలవచ్చు
గాదె చిక్కు జింతయు లేక ♦ కర్ణ! మనము.

మఱియును క్షత్రియులు రాజ్యలాభంబునకై వారు వీరను భేదము మనమున నుంచుకొనకుందురు. మాయోపాయముచేతగాని పరాక్రమముచేతగాని, రాజ్యము సంపాదించుట రాజుల కుచితకార్యమని నీవెఱింగియుండవా!

కర్ణ—గతించినదానికై యిప్పుడీ చర్చయేల? పాండవుల మరణంబును గూర్చి మీతండ్రిగారికిఁ దెలిసినదా.

దుర్యో—ఇంతవఱకునుఁ దెలిసినట్లు దోచదు. అయినను దెలియక దాగునా! ఒకసారి తండ్రిగారికడకరిగి వచ్చెదను. అక్కడ సమస్తమును దెలియఁగలదు. (నిష్క్రమించును)

(తెర లేచును.)

[ధృతరాష్ట్రుఁడు భీష్ముఁడు దుర్యోధనుఁడు ప్రవేశము]

ధృత—వత్సా! దుర్యోధనా! వారణావతంబునుండి పాండవుల కుశల వార్తలేమయిన వచ్చుచున్నవా!

దుర్యో—(తనలో) ఈతండింకను పాండవుల మరణమును వినలేదు. నెమ్మదిగా నదియే బయలుపడవలయునుగాని నేను మాత్రము చెప్పరాదు. (ప్రకాశముగా) ఇంతవరకును నేవార్తలును వచ్చినట్టులేదు.

ధృత—ఏటికోగాని నా యెడమకన్నును నెడమ భుజంబును నదరు చున్నది.

భీష్మ—

తే॥ గీ॥ కొడుకు మాటల నాలించి • క్రూరమైన
బుద్ధి బూని నీవును గదు • బుణ్యమతులఁ
బాండవేయులఁ గాశికి • బంపినావు
రాజ్యమును గొందునంచును • రహిఁదలంచి.

నీతమ్ముఁడైన పాండురాజు నీకై యెన్ని కష్టంబులనోర్చి వైరులను జక్కఁడచి యెంతయో ధనముదెచ్చి యనేక యాగంబులు జేయించి తుదకు శాపవశంబున మరణమందినాఁడు. అట్టి యెడలఁ దమ్ముని పుత్రులనియైనను దలంపక వారిని రాజ్యంబునుండి వెడలనడపితివి. నాకెందుకని నేనూరకొంటిని.

ధృత—మహాత్మా! మన్నింపుము. తెలిసియో తెలియకనో చేసినాను ఇంక వారి నిచ్చటికి మరల రావించెదను.

దుర్యో—(తనలో) బ్రతికియున్నగదా వారిని రావించుట.

సేవ—(ప్రవేశించి) దేవా! వారణాసినుండి ఖనికుఁడరుదెంచి భవద్దర్శనార్థమై వేచియున్నాఁడు.

ధృత—శీఘ్రింబుగ లోనికి రానిమ్ము. పాండవుల కుశలవార్త నాలింప నాచిత్తము తత్తరమందుచున్నది.

[ఖనికుఁడు ప్రవేశించును.]

ఖని—(తనలో) పాండవులను సుఖముగా బిలమునుండి తప్పించితిని. వారీపాటికి సుఖముగా నెక్కడనో జేరియుందురు. వారణాసి యందుఁ బాండవులును గుంతియు మరణించిరని చెప్పుకొనుచు న్నారు. కానిమ్ము, యిదియు నొక మేలే. బ్రతికియున్నా రని తెలిసినచో నీ దుష్టుండగు కౌరవేంద్రుఁడు మఱియొక మాయ బన్నును. కావున వారు గతించిరనియే చెప్పెదను. (ప్రకాశముగా ధృతరాష్ట్రుని జూచి) మహారాజా వందనములు.

ధృత—ఖనికా! నీవు వారణాసినుండియే వచ్చుచుంటివా!

ఖని—అవును.

ధృత—పాండవులచ్చట సేమంబుగ నుండిరా!

ఖని—అచ్చట పాండవు లెచ్చటనున్నారు?

భీష్మ—ఏమి! పాండవు లచ్చటలేరా!

ధృత—దేవా! ఏమియు నెఱుగనట్లు పలికినచో నేమి చెప్పుదును. రా జాగ్రణీ! నీవు నన్ను వధించినను భయంబందువాడనుగాను.

దుర్యో—ఖనికా! ఎందుకీ యనవసరప్రసంగము? చెప్పఁదలంచిన దేది యో క్రమముగాఁ జెప్పుము.

ఖని—అయ్యో! ఎవ్వరును నేమియు నెఱుంగన ట్లడుగుచుండుటను జూచి నేనిట్లంటిని. ఓ ధృతరాష్ట్రమహీపాలా! పాండవుల నేమంబుగ నెట్లుందురు.

ధృత—పాండవులు సేమంబుగ లేరా!

భీష్మ—ఖనికా! ధర్మపరాయణులగు పాండురాజ తనూజులు క్షేమం బుగ లేరా! అది యేదియో సత్వరముగఁ జెప్పుము. చిత్తము సంతాపమందుచున్నది.

ఖని—అయ్యా! వారి దుర్వార్త చెప్పటకు నోరాడకున్నది. అయిన ను మీరెంతకు బూర్వమే వినియుందు రేమోయని యూహించెదను.

ధృత—"యొరసిన పుండుపై యుప్పు" బెట్టినట్లు పాండవుల కుశలంబు వినుటకు వొందరపడుచున్న నాహృదయంబునకు మఱింత సంతాపమేల కలుగఁ జేసెదవు.

ఖని—దేవా! రాజ్యమపహరింపఁ దలంతు రేమోయని సద్గుణమూర్తులయిన పాండుకుమారులను నిలువెళ్లఁగొట్టితివి. అంతియే గాక నీతనయుఁ డొక లక్కయిల్లు నిర్మించినాఁడు. మీచే నిర్మింపఁబడిన మాయాలక్కయింటఁబడి యా పాండవులు దగ్ధులైరని చెప్పుటకెంతయుఁ జింతనొందుచున్నాను.

ధృత—భీష్మ—హా! (అని మూర్ఛిల్లి లేచుచున్నారు.)

దుర్యో—అక్కటా! ఖనికా! పాండవులీ లోకంబును విడిచి స్వర్గ సౌఖ్య మందబోయిరా!

ఖని—మీ దయచే వారికట్టిగతి ప్రాప్తించినది. మహారాజా! నీకోరిక నెఱవేఱినది. ఇంక నీవు నిష్కంటకంబుగ ధరావలయంబు బరిపాలింపవచ్చును. పాండవులేమిసేయుదురో యను భయము నీకిక నవసరము లేదు.

ధృత—(దుర్యోధనునిజూచి)

తే॥ గీ॥ పరమ పావనచరితులౌ ♦ పాండుసుతులఁ
బంపితిని నీదు మాటపై ♦ వారణాసి
వారి నచ్చోట బావక ♦ జ్వాలలందు
గూలునట్లుగ జేసితే ♦ కుమతి వగుచు.

ఓరీ! దుష్టుఁడా! ఎంత కార్యమును జేసితివిరా! పాండవుల మరణంబునకు నేనేగదా కారణభూతుండను.

తే॥ గీ॥ ఇట్టి మాయబన్నితివని ♦ యెఱుఁగలేక
బంపినందుకు నీవిట్టి ♦ పాతకంబు
సలిపినాడవు; వారలు ♦ సమసినారు
నేనె కారణంబిందుకు ♦ హీనచరిత.

దుర్మార్గా! ఎంతపని చేసితివిరా! విషపూరిత మధుఘటంబవని తెలియక మోసపోయితిని. ఆ పాండురాజుకంటె నాయందు భక్తి ప్రేమలు బూని సేవించు పాండుసుతుల మరణంబు నాలించియు హృదయము బ్రద్దలుగాక నిలచి యున్నది. కటా! ధాత దీనిని లోహముతో నిర్మించెను గాబోలు. (భీష్మునిఁ జూచి) తండ్రీ! వింటివా!

భీష్మ—వినకేమి! ఈవిషయమై నేనేమియు మాట్లాడరాదని మొదటనే యూరకొంటిని. కానున్నదో హీనగుణుండును, నొకరి బాగుఁ జూచి యోర్వలేనివాఁడును నగు నీ సుయోధనుండు చెప్పినంత మాత్రమున నే పాండవులను పురినుండి నడిపితివి. సర్వస్వతంత్రత గలిగియున్న నీ కొరుకేల చెప్పవలెను. “నే పాండవుల జంపనన్నచో” ఈ దుర్మార్గుఁడేమి చేయగలుగును. ఇటువంటి వానిని జంపినను పాపములేదు. కులము నిర్దోషమగును. (దుర్యోధనుని జూచి) పాపకర్మా! ఎంతటికార్య మాచరించితివిరా! దుర్మార్గా! నీ ముఖంబు జూచినఁ పంచమహా పాతకంబులునుగలుగును. పాండవులను జంపించిన పాపము మిమ్ములఁగట్టికుడుపక మానదు. కులవృద్ధుఁడగు నన్నుఁగూడవీక్షింపకనిట్లుగావించితివి. ఇంక మీకు జయంబు గలుగునను మాట కలలోనిది. మిమ్ములను కులనాశనకారణులని తలంప వచ్చును. కులము నాశనము జేసికొనుటకే యిట్టి పాపకార్యముజేసినాడవు. ఛీ! మీయెదుటను నుండరాదు. (నిష్క్రమించును.)

ధృత—(సుయోధనుని జూచి) కుమారా! భీష్ముండు వెళ్ళిపోయెనా యేమి? ఈతనికాగ్రహము వచ్చినదే. అక్కటా! నేనే స్వయముగా తెచ్చిపెట్టుకొంటిని. (తనలో) నేనిప్పుడేమయిన నంటినా, యీతనికాగ్రహమువచ్చును. (తనలో) ఇవ్విషయమ్మై ద్రోణ కృపాదులతోగూడ యోచించి పాండవులకు దగిన కర్మల జేయవలయును. (నిష్క్రమించును.)

సుయో—(తనలో) ఇప్పుడు నాకు సంతోషముకలిగినది. పితామహ ద్రోణాదులు నన్ను దూషించినను నేను లక్ష్యపెట్టకయుండినచో వారేమిసేయఁగలరు. (నిష్క్రమించును.)

శకు—(తనలో) పాండవుల మరణంబు నిజమనియే ధృతరాష్ట్రుఁడు నమ్మెనుగదా. సుయోధనుండు సంతసింపుచుండెను. కానిమ్ము. ఇదియునుమంచిదే. (నిష్క్రమించును.)

రంగము—హిడింబాసురుని వనము.

[కుంతి, ధర్మార్జుననకుల సహదేవులు నిద్రింపుచుండగా భీముఁడు ప్రవేశించును.]

భీము—(తనలో) ఇంకను వీరు నిద్రలోనే యున్నవారు. (ఇంచుక యూరకుండి నలుదిక్కులు గలయంజూచి)

ఉ॥ అకటా వాకిలి యొత్తుగానలికి న ♦ ట్లాకాశముల్ మబ్బుక్రి
మ్మకొనెన్ ధాత్రికి డిగ్గుతారలనఁగాఁ ♦ బుర్వుల్ ప్రకాశించెమిన్
మెకముల్ భీతిని గొల్పఁజేయురవముల్ ♦ మొండమ్మెనిచ్చోటు; మా
కికనేదారియుఁ దోచదాయెగద లో ♦ కేశా! యశోదాసుతా॥

భగవంతా వాసుదేవా! అన్నిటికిని నీవేయున్నవాడవు. మమ్ము రక్షించుభారంబు నీయదియైయున్నది. (సోదరులనుజూచి) వీరంద

రును నిద్రలేచువరకును వీరికే హానియుఁ గలుగకుండ గదాధరుండనై రక్షింపుచుందును.

(తెరలో)

అల్లాల్లా! అల్లల్లా! అలఅల! అలఅల! సోదరీ! హిడింబీ! నేఁడు మనవన సమీపంబున కెవ్వరో నరులరుదెంచినారు. నీవు సత్వరమ్ముగ నరిగి వారలను వధించి నాకు రుచికరముగా వండిపెట్టుము.

భీము—ఏమిది! ఎవ్వడోకదా దైత్యునిపలెనున్నాఁడు. ఇయ్యది రాక్షస సంచారమగు భూమికాఁబోలు. అక్కటా! తెలియక మేమిందుఁ బ్రవేశించితిమి. దైత్యార్భటంబు లధికమగుచున్నవే. సరే! దీనికాలోచింపనేల! భయమందనేల? యమగదాదండంబును మించినగదాదండము నాయొద్దనేయున్నదిగదా. ఎట్టిమ్రుక్కడి రక్కసులువచ్చినను నొక్కపెట్టున జక్కడఁచెద.

(తెరలో)

అగ్రజా! నీయాజ్ఞ ననుసరింపుచున్నాను.

హిడింబి—(ప్రవేశించి) ఓరోరీ! దుష్టమానసులారా! మావనంబునఁ జొచ్చిన మీరెందుఁబోఁగలరు. మీరందరును నేఁడు మా కాహారమగుదురు. (భీమాదులమీఁదికి రాఁబోవును.)

భీము—(తనలో) ఇదియొకరాక్షసి. అబ్బా! ఏమి దీనిభయంకరరూపము. ఎట్లయినను దీని నిప్పుడు జంపి రాక్షసభయంబును మాన్పవలయును. (ప్రకాశముగా)

ఓ రక్కసీ! దూరముగానిల్వుము. ప్రాణంబుల కాశించితివేని పైకిరమ్ము. గదాధరుండగు భీముండిచ్చటనున్నాఁడని తలంపుము.

హిడిం—(భీముని తేఱిపాఱఁజూచి) ఆహా! మొదట వీరినిఁజంపుటకు నాగ్రహాయత్తచిత్తనయి యరుదెంచితిని. కాని యిప్పుడితని

ముఖబింబంబుజూచి నంతనే వీరిని వధించుటకు నాచిత్తము స

మ్మతింపకున్నది. భళిరా! ఏమి! ఈపురుషవరేణ్యుని సౌ

యగము.

ఉ॥ చేరలనేలగాఁదగిన ♦ చిన్నికనుంగవఁ గాంచినంత ల

క్ష్మీరమణీవతంసము వ ♦ సించెడుభంగినిదోఁచు, మోము నో

య్యారముజూడ బూర్ణశశి ♦ యందమునేలును; నెవ్వఁడోయితం

డారయఁ; జూచినంత వశ ♦ మయ్యెను నామదియేమిసేయుదున్.

ఇట్టి సుందరమూర్తిని నే నెచ్చటను దిలకించియుండలేదు. ఈ తనినిఁజూడగనే నాచిత్తం బీతనిపైకిఁ బాఱుచున్నది. మదనుండదయుఁడై తన పదునైనశరంబులు నాహృదయంబున నాటఁబఱుపుచున్నాఁడు. విరహామగ్గల మగుచున్నది. ఈతని కూటమింగలియక నెక్కింత కాలమైనను దాళఁజాల. (ఇంచుక యూరకొని) ఇప్పుడు నే నీరూపంబుతో నీతనికడఁ జేరితినేని వికృతరూపమును జూచి, రాక్షసియని నన్నుఁ జేఁబట్ట నిరాకరించును. కావున నా ఖేచరీవిద్యాప్రభావంబున దివ్యసుందరినై యరుదెంచి యాతనిచిత్తమును మోహసాగరంబున ముంచి నాయభీష్టంబు దీర్చుకొందునుగాక. (నిష్క్రమించును.)

భీము—ఇదియంతయు రాక్షసమయమైన యరణ్యమువలెనున్నది. సోదరులును దల్లియు నిద్రలేచినపిమ్మట వేరొండుస్థలమున కరుగుట యుచితమని తోఁచుచున్నది. దినములు తప్పివచ్చినప్పు డెట్టి సంకటంబులు ప్రాప్తించునో! నేనుమాత్ర మతిజాగరూకుండనై వీరిని రక్షింపుచుండవలయును.

[హిడింబి సుందరరూపంబునఁ ప్రవేశింపుచున్నది.]

భీము—(హిడింబినిఁజూచి) ఈయర్ధరాత్రిసమయంబున నొంటరిగా నెవ్వరో కాంతాతిలకం బిట్లువచ్చుచున్నది. ఈమె యెవ్వరై

యుండవచ్చును. ముల్లోకంబులను తన వీక్షణంబులచేత మోహంబున ముంచివేయఁజాలిన యీ సుందరాంగి యెవ్వరిచేతనైన బాధింపఁబడలేదుగదా !

హిడిం—(తనలో) ఈపురుషవరేణ్యుం డిచ్చటనే యున్నవాఁడు. ఇంక నేను సందియంబందనేల. ఈతనిని సమీపించెదగాక. (భీముని సమీపించి) మహాపురుషా !

తే॥ గీ॥ ఎవ్వరవొగాని నిన్ను నే • నెఱుఁగనైతి
నార్తనై మ్రొక్కుచుంటిని • నధికభక్తి
నాయభీష్టముదీర్పుమ • నంబునందు
కరుణదాల్పుముదప్పకఁ • గలుషహర.

భీము—(తనలో) ఈమె యిచ్చటి కొంటరిగా నరుదెంచుట కేమికారణమో! నాకీమె మ్రొక్కి యభీష్టముదీర్పుమని కోరుచున్నది. ఈమె యభీష్టమెట్టిదో అయినను అడిగెదనుగాక. (ప్రకాశముగా)

మ॥ తరుణీ! యెవ్వతెవీవు; యీకరణి రా • త్రింబందు నిచ్చోటకీ
వరుదేరన్ బనియేమి; నన్నుఁ గని సం • ప్రార్థింపగానేల; త
స్కరులెవ్వారలునైనఁ గ్రూరులయిరే • గారించిరో కానిచో
సరగన్ జెప్పుము భీష్టమేదొ వినఁగన్ • గౌతూహలంబయ్యెడిన్.

హిడిం—మ్మథసమానసుందరా !

తరల.

కలదునామది నొక్కకోరిక • కామసన్నిభరూప; నీ
వలనఁగాదని యంటివేనియుఁ • బ్రాణముల్ ధరవీడగాఁ
దలఁచివచ్చితి నమ్ముమీనను • తథ్యముఁగ వచియింతు; నిం
కలుషుపేర్మిను దీర్పుమీయది • యార్తనై నినుఁ జేరితిన్.

భీము—(తనలో) ఈమె యభీష్టమెట్టిదియై యుండునో గదా. (ప్రకాశముగా) రమణీ! సందియమందెదవేల. చెప్పుము.

హిడిం—ఓ మహానుభావా! చల్లకరుదెంచి మంత్ర చంకను బెట్టినందున లనఁ బ్రయోజనమేమున్నది. నేనీవనంబున కధికారియగు హిడింబాసురుండను దైత్యునకు సోదరిని. నాపేరు హిడింబి. నా యగ్రజుండు నన్నుగని మన వనంబునకు నరులెవ్వరో యరుదెంచిరి కావున వారిని వధింపుమని యాజ్ఞనీయ మొదట నే నిచ్చోటి కరుదెంచితిని. నీ సుందరవిగ్రహంబు జూచినయంతనే చిత్తము మారిపోయినది. మన్మథుండించుకయైనను గరుణలేక దన పుష్పశరంబులు నాపైఁ జిమ్ముచున్నాఁడు. ఇంక నీవు నన్నుఁ దప్పక గరుణింపవలెను.

భీము—(తనలో) దైత్యయువతికి యిట్టి రూపురేఖావిలాసంబులుండుట యెచ్చటను జూడలేదు.

తే గీ॥ ఇట్టి నడిరేయి యందునఁ ♦ నిట్టిరూపు
దాల్చి యరుగుదెంచినయట్టి ♦ తరుణిఁ జూడ
మనము చలియింపదే యెట్టి ♦ మునులకైన
మనుజులనుగూర్చి యింక జె ♦ ప్పంగనేల.

కాని నాచిత్తంబునుమాత్ర మించుకయైనను జలింపనీయ కూడదు.

హిడిం—వీరపురుషా! నీవు నన్నుఁగూర్చి యేదియో సందియంబందుచుంటివి. ఆలస్యమున కీయువిద తాళజాలదు. నాయభీష్టము దీర్చితివేని నావలన నీ కనేక సాయంబు లొనఁగూడును.

భీము—స్త్రీవగు నీవలన నాకుగలుగు సాయంబెట్టిదియో చెప్పుము.

హిడిం—ఈ వనంబున కెల్ల మదీయసోదరుండగు హిడింబాసురుం డధిపతి. మీరాక నాతఁ డెఱింగెనేని మిమ్ములనందఱ నొక్క

పెట్టున వధించును. ఈనిద్రబోయెడివారిఁజోలి నీకేల. వానివలన నీ కేయుపాయంబును లేకుండ నిన్ను దూరముగాఁ గొనిపోయి రక్షించెద.

భీము—ఓవెఱ్ఱిదానా! మాయన్నసంగతిఁ జెప్పి నాకు భయంబు గొలుపఁజూడకుము.

తే॥ గీ॥ అష్టదిక్పాలకులఁగూడి ♦ యమరభర్త
యరుగుదెంచునుగాక ఘో ♦ రాజియందు
భయము నిసుమంతచెందను ♦ పడతి! వినుము
దైత్యవల్లభుమాటను ♦ దలఁపనేల.

ఇదియా నీవు చేయనెంచిన సాయము. ఇంతియేగదా. ఒకవేళ నేను నీయన్నయగు హిడింబాసురునికి భీతిల్లుదునని తలంచితివేమో. అట్లెన్నటికిని దలంపకుము. చతుర్దశభువనంబులును నొక్కపెట్టున న వచ్చినను పోరాటంబునకు వెనుదీయక వైరిబృందంబును మదీయచండగదా దండంబుచేఁ బిండిపిండిగఁ గావించెదను. (ఇంచుక యూరకుండి) అదియునుగాక నీకై యీమాతాసోదరులను విడనాడి రమ్మనుచుంటివి. ఇదియేటిమాట. దైత్యాంగనవగు నీపొందున కాశించి తల్లిని సోదరులను విడనాడుదునని తలఁచితివా!

హిడిం—వీరాగ్రేసరా! తెలిసియో తెలియకనో పలికిన పలుకుల మన్నింపుము. మాయన్న కంటబడకుండ మిమ్మందరిని నింక వేరొకచోటికి దీసికొనిపోవుదును. నాయభీష్టము దీర్పుము.

భీము—నీవు మాంసాశనివి. నేను సుక్షత్రియవంశసంభూతుండను. నీకును నాకును మైత్రి యెట్లగును. ఇంక నీమాటల గట్టిపెట్టి నీయన్నతో నిర్వనంబున నరులున్నారనిచెప్పుము. అతఁడా మాటల నాలించి యరుగుదెంచెనేని నిమిషమాత్రంబున నాతనిప్రా

ణంబుల గొని వనమున బాంధులు నిర్భీతిగ సంచరించునట్లు గావించెద.

హిడిం—అగ్రజుని నీవు వధించుటకుగూడ నేను విచారింపను. నీవాతని జంపినను సరే. నాయిష్టము నాత్రము దీర్పుము.

ఉ॥ గోరము నీమొనర్ప మిగుల • గానిది నాదగు నగ్రజుండు దిర
స్కారమొనర్చినన్ను విభు గావరియింపగ వచ్చినాను; భూ
దారకులాబ్ధిపూర్ణశశి! • తప్పకనాదగు కోర్కె దీర్పుమిం
పారయశంబు జేకుఱును • సర్వశుభంబులు మిమ్ము జేరెడిన్.

నేను దైత్య యువతినని సందియుంబందవలదు. నేను కామరూప సంచారిని. ఎప్పుడేయేరూపము గావలయునో యట్టిది తప్పక దాల్ప గల సామర్థ్యమున్నది. ఇదియుంగాక నన్ను నీవు స్వీకరించితివేని నా వలన నీకు బెక్కు కార్యములగును.

భీమ—(తనలో) ఆహా! ఈకోమలి వాక్యంబులు నాచిత్తంబు నెంతయు జలింపజేయుచున్నవి. ఇక్కాంతామణి నన్ను వరునిగా జేకొనదలంచి యగ్రజుని విడిచి వచ్చినదట. ఆతని వధకుగూడ సమ్మతింపుచున్నది. (ఆలోచించి) అవును. ఇందాశ్చర్యమేమున్నది. విదర్భరాజనందనయగు రుక్మిణియు కృష్ణుని బెండ్లియాడదలంచి, యింమలకు వడ్డమువచ్చిన యామె సోదరుని కృష్ణుండు పరాభవించినప్పు డుపేక్షింపలేదా.

హిడిం—మహాత్మా! యోచింపుచుంటివేమి! అన్నము పెట్టవచ్చినప్పుడు నిరాకరించువాడెవ్వడైన యుండునా! మార్గవశమునబోవు సమయంబున చేతికిదొరికిన ధనంబును నెవ్వడైన బాఱవేయునా! తనంతతాను వలచి వచ్చిన చేడియ నుపేక్షించుట నీకు ధర్మముగాదు. ఈ జన్మంబున నాకు నీవే మనోహరుండవని తలంచి వచ్చితిని.

మ॥ కరుణన్ నీమ కృపారసంబొసఁగినన్ ♦ గాపాడి రక్షింతువో
స్మరుఁడిప్పట్టున వేయు బాణములనన్ ♦ జావంగ వీక్షింతువో; సుం
దర! నీచిత్తము నా సుభాగ్యమిఁక వా ♦ దంబేల నేనన్యథా
శరణంబు నాస్తి యటంచుఁ జేరితిని నన్నున్ ♦ సంరక్షయుం చిట్టులన్.

[తెరలో]

ఓసీ! హిడింబీ! అనరికీటకంబులను వధించి తీసుకొని రమ్మని నేను చెప్పి పంపగా, నా కార్యము మఱచి యీ పురుషునితో నెవ్వియో సరస సల్లాపంబులు గావించుచుంటివా! ఏమే! నీ ధైర్యము ఇదిగో వచ్చుచున్నాను.

హిడిం—ఓ! బలశాలీ! రక్షింపుము. రక్షింపుము. మా యన్న దండతాడిత మహోరగంబు కరణి మండిపడుచు వచ్చుచున్నాఁడు. నన్నింక బ్రదుకనీయఁడు.

(భీముని పాదములపై బడుచున్నది.)

భీము—కల్యాణీ! భయమందకుము. నీయన్నయగు నా మృక్కడిరక్కసుని నిమేషకాలంబులో నంతకునివీటి కతిథిగాబుచ్చివచ్చెదను. ఆతం డిక్కడ కరుదెంచెనేని మా సోదరుల నిద్రకు భంగము గలుఁగును. నేను వచ్చువరకును నీవు వీరి నతిజాగరూకురాలవై యరయుచుండుము.

(నిష్క్రమించును.)

ధర్మ—(అదరిపడిలేచి) ఏదియో యొక భయంకరమైన ధ్వని నాకిప్పుడు వినవచ్చినది. ఇది యేమైయుండును. ఇప్పుడు వినవచ్చిన యీ భయంకరారావంబునకు నా జననీసోదరులేమియు భయమందక నిద్రించుచు నేయున్నారు. ఇది యునొకమేలే. ఆలాక్షా గృహదావంబునుండి భీముండు మమ్ములదప్పించి యిచ్చో

జేర్చియున్నాఁడు. వీరందఱును మార్గాయాసంబున మిగుల డస్సి మేనుల మఱచి నిద్రింపుచున్నారు. ఆహా! నాతమ్ము లెట్టి ప్రదేశమునందు శయనించినారు!

ఒరులకును గీడుల ♦ నొనరింప రాబోరు
పరయువతులపైన ♦ భ్రాంతిఁ గొనరు
స్వప్నంబునందైన ♦ సత్యంబు దప్పరు
న్యాయమార్గంబు నె ♦ న్నండు విడరు
పృథ్వీసురుల సేవ ♦ విడనాడ నెంచరు
సేవకాళిని శిక్ష ♦ సేయబోరు
పెద్దలతో నెప్పు ♦ డ ంఢై రియుందు
రితర సంపదలకు ♦ నీర్ష్య జెంద

తే॥ గీ॥ రట్టి సుగుణచరిత్రు ♦ నను జు లకట
కంటకపరీత మైనట్టి ♦ కటికనేల
నిద్రబోవుచు నున్నారు ♦ భద్రముగను
ధాత వ్రాసిన వ్రాలును ♦ దాటఁ దరమె॥

(తల్లినుద్దేశించి) హా! తల్లీ! నీవు మహాసుకుమారాంగివి. ఎప్పుడును నంతఃపురంబునందనేకవేల దాసీ జనంబులు బరిచర్యలు సలుపుచుండ సౌఖ్యంబు గాంచుచుండెడిదానవు. అట్టి నీకు మా మూలంబున నిట్లు సంకటంబులు బ్రాప్తించినవిగదా.

ఘ॥ పతిగతియింపగా భువిని ♦ బ్రాణము బాయక యట్లటుల్లా యీ
సుతులను జూచుకొంచు మది ♦ శోకము మిగ్గి విరోధి నీమనా
యతమతి జేరి కాలముచు ♦ నట్టులబుచ్చుచు నుండఁజూచి దు
ర్మతియగు నాసుయోధనుఁడు ♦ మాకిటు జేయగ నెంచె నెగ్గులన్.

ఆ దుర్మార్గుడయిన దుర్యోధనుండు మనల నందఱ లాక్షాగృహంబున దగ్ధులుగాఁజేయఁ దలంచెను గాని నీకడుపు చలవచే మేము

బ్రతికితిమి. నీవును సుఖంబుగ నుంటివి. మనల నందరను భీముం డీ స్థలంబునకు సుఖముగాఁ జేర్చినాఁడు. (ఇటునటుఁ జూచి)

తమ్ముడా! భీమసేనా! భీమసేనా! ఏమిది పలుకవు. (శయ్యా ద గ్గరకరగి చూచి) ఏమిదీ! భీముడు గనుపింపఁడే. ఏమాయెనోగదా. ఎన్నఁడును మమ్ము విడనాడి యెచ్చటికినిఁ బోయి యెఱుంగఁడు. ఇట్టి నట్టడవిని మమ్ము డించి యితఁడెచ్చటికిఁ బోయి యుండును. హా! త మ్ముడా! వాయునందనా! మాతో గడగండ్ల గుడువలేక మమ్ము విడి చి నీదారి నీవు చూచుకొంటివా! (విచారించును.)

హిడిం—దేవా! మీతమ్ముఁడగు భీముండీ ప్రాంతంబునందున్న హిడిం బాసురుండను మృక్కడి రక్కసునితోఁ బోరుసల్ప నరిగినాడు. ఇప్పుడే రాగలఁడు. ఆతఁడరుదెంచువరకును మిమ్ముల రక్షిం పుచుండుమని నాకాజ్ఞాపించినాఁడు.

ధర్మ—తండ్రి! భీమా! నీకింత సాహసమేలనోయి. మమ్ముల నెవ్వరి నయిన సాయంబుగొనిపోవక యొంటిగా దైత్యునితోఁ బోరా డనేల నరిగితివి. నీవు మరల నరుదెంచి నా కన్నులకు విందు గూర్చు భాగ్యము నేను నోచితినా.

(కుంతి నిద్రనుండి లేచును.)

కుంతి—కుమారా! ధర్మనందనా! ఏవియో భయంకరార్భాటంబులు వినవచ్చుచున్నవి. ఇది రాక్షస సంచారంబుచే నొప్పుచుండెడి భూమి కాబోలు. మన భీముండేడి?

ధర్మ—తల్లీ! ఆతఁడు ప్రాంతంబుననున్న హిడింబాసురుండను దానవుని తోఁ బోరొనర్ప నరిగినాడఁట.

కుంతి—అకటా! భీమసేనా. ఒంటిగా నరిగితివా. తనయులారా! భీమున్న కెట్టిహాని కలుగునోకదా. నాచిత్తంబున ధైర్య మాం గక యున్నది.

ధర్మ—జననీ ! నీవు భీముని సంగతి నెఱింగియుండియు నీరీతి విచారపడె దవేల ? (అర్జునుని జూచి) అర్జునా ! నీవు బాణపాణివై భీముఁ డున్న దెసకరిగి యవసరమయ్యెనేని యతనికి సహాయంబొనర్పుము. అంతియేగాని బాల్య చాపల్యమున సాహసముమాత్రమ్ము సేయకుము. మన దినములు తప్పివచ్చినవి.

అర్జు—అగ్రజా ! ఆజ్ఞ ననుసరించెదగాక !

కుంతి—(హిడింబినిఁ జూచి) యువతీలలామా ! నీ వెవ్వరవు? ఈ ఘోరారణ్యంబున నున్న మాకడ కేల యరుదెంచితివి. మమ్మ్ము గడ తేర్పఁ దలచి యరుదెంచిన దైత్యవనితవు గావుగదా. నిన్నుఁ జూచిన మాకెంతయో సందియంబు గలుగుచున్నది.

హిడిం—తల్లీ ! నీవు దలంచినట్లు నేను నిజముగా దైత్యవనితనే. ఇప్పుడు భీమునితోఁ బోరాడుచున్న హిడింబాసురుఁడు నాయన్నయగును. తొలుదొల్త యాతని యానతినిబూని యిచ్చట కరుదెంచి విశాలవక్షుండును, బూర్ణేందుబింబ వదనుండును, కంజనేత్రుండును, నాజానుబాహుండును, మహాబలపరాక్రమ సంపన్నుఁడును నగు భీమునింగాంచి మదనుబారికి లోనై యాతండే నాకు దైవంబును, మనోహరుండును నని తలంచి యాతని సన్నిధి కరుదెంచితిని. ఇంతలో నాయగ్రజుండు దీనింగని మిమ్మ్ములను నన్ను గూడ మ్రింగదలంచి భయంకర రూపుండై యరుదేరగాఁ జూచి మీకు నిద్రకు భంగమగునని తలంచి భీముండు వానిని సమీపస్థలమునకు దీసికొనిపోయి పోరాటంబునకుఁ దలపడెను. ఆతఁడు జయము వహించి సత్వరమ్ముగనే రాఁగలండు.

[తెరలో]

ఉ॥ చీరవు మమ్ము నెవ్వరిని ♦ జెచ్చెర సాహసమట్లు బూని యీ
తీరున నేగుదెంచితివె ♦ దేవవిరోధిని గూల్పగా! నదే
తూరుపు దెల్లవాఱె మన ♦ దోర్బలమెక్కుడు వేళయయ్యె నీ
వూరక గొంతిసేపు భుజ ♦ యుద్ధమొనర్చి వధింపుమీతనిన్॥

ధర్మ—అవిగో! అయ్యవియర్జునుని పలుకులు. తమ్ముడు సుఖముగా నరుదెంచుగాక.

కుంతి—(హిడింబినిఁ జూచి) దానవాంగనా! నీవెక్కడ మాభీముండెక్కడ. నరమాంస భక్షకురాలవగు నిన్ను గ్రహించుటకు మా భీముండెట్లు సమ్మతించును. ఇట్టి యూస నీ మనంబుననుండి విడనాడుము. ఇంతవరకు నీవు మమ్ములను రక్షింపుచున్నందుకును, నా కుమారుని వార్త చెప్పినందులకును మేము నీయెడల గృతజ్ఞులమై యుండవలయును. అంతియేకాని రిత్తకోరికను మనంబునఁ జేర్చుకొనకుము.

హిడిం—(రహస్యముగా) తల్లీ! నీవెఱుంగనిదీ జగంబున లేదు. రూపవంతులగు పురుషులను జూచినచో గొందఱు స్త్రీలు మోహించుట స్త్రీలోకంబున సామాన్యముగ నున్నదే. ఇవ్విషయంబు నీకునుఁ దెలిసియే యున్నది. ఈ జన్మంబున నాకతండే భర్తయని మోహించి బంధుజనులను విడనాడితిని. అతనియందున్న మక్కువచేత సగ్రజుని వధకైనను సమ్మతించితిని. నన్నాతండు గైకొనఁడేని యాతని చరణ సన్నిధిని బ్రాణంబులు బాయుట కరుదెంచితిని. ఇదియే నా మనోనిశ్చయము.

ధర్మ—(సంతోషమున) అదుగో! భీమసేనుండు విజయలక్ష్మీలాలితుండై తమ్ముఁడగునర్జునునితో వచ్చుచున్నాఁడు. (ఎదురు వోవును.)

[భీమార్జునులు ప్రవేశింపుచున్నారు.]

ధర్మ—తమ్ముఁడా ! వచ్చితివా ! నన్నొకసారి కౌగలించుకొననిమ్ము.

కుంతి—తండ్రీ! మరల కంటబడితివా?

నకు—అన్నయ్యా ! ఎంతసాహసకార్యముచేసితివి ! మమ్మెవ్వరినైన బిలువకుండ నొంటరిగా నేలయరిగితివి?

భీము—ఆదైత్యు నణఁగించుట కెంతకాలముపట్టినది! (హిడింబిని జూచి) ఈరక్కసివాని చెల్లెలే. దీనినిగూడ నంతంబొందించివనం బరాక్షసంబుగావించెదను.) (హిడింబి పైకిబోవుచున్నాఁడు.)

ధర్మ—(వారించి) తమ్ముఁడా ! ఏమి ! ఈసాహసము. ఆడువారలపైన నీపరాక్రమము మేలచూపెదవు.

తే॥ గీ॥ చంపఁదగినట్టివానినిఁ ♦ జంపినావు
చంపదగనట్టిదానను ♦ జంపనేల
నిన్ను మదిలోనగోరి యీ ♦ నీరజాక్షి
వచ్చియున్నదిబోవు మీ ♦ పరమకృపను.

నిశ్చయముగా నొకరివలన నాపదయేవచ్చునుగాక. వచ్చినను వారు శరణందినప్పుడు రక్షించుటయే పరమధర్మము. తమ్ముఁడా ! ఈ యబల నీపైఁ జిత్తమును బదిలపఱపుకొని నిన్నే భర్తగావరించి బంధువులనెల్లవీడి, తుదకు నీచే దనయన్న చచ్చుటకుగూడ సమ్మతించి యిచ్చుటకు వచ్చినది. జన్మమునెంచిచూడ నియ్యది రాక్షసియేయైనను దీనియందింక నీవట్టిభావ ముంచవలదు. ఇయ్యది మహాజ్ఞానసంపన్నురాలివలె గానిపించుచున్నది.

హిడిం—ఓ కుంతీమహాదేవీ! యోధర్మనందనా ! మీరు నాయిష్టంబు సమకూర్పరేని నాప్రాణంబు లీభీమునిసన్నిధియందే బాసి ముందుజన్మంబునకైనను నితనిని బతిగాఁ బడయుదు. మీరు నా

కోర్కె సఫలంబుగావించిరేని మీకుఁ బెక్కుకార్యంబులయం దనేక సహాయంబులు సేయుదును. ఎక్కడకుఁగొనిపొమ్మన్నను మిమ్ముల నందర నొక్కసారిగా నెత్తుకొని గొనిపోగలను. నే నతీతానాగతవర్తమానంబు లెఱింగినదానను. నన్నుఁ బరీక్షిం చిచూడుడు. ధీరీమార్గంబున దిన్నగా నరిగితిరేని ముందర నొక కాసారంబు గాంచగలరు, అక్కడ నొక్కవనస్పతియుం గలదు. ఆరెండును శాలిహోత్రుండను మునిపుంగవునిచే దపం బునంజేసి గాంచఁబడినవి. అసరోవరజలంబులు ద్రావినవారికి నాకలియు దప్పులును నడంగి యధికతేజశ్శాలురై యుందురు. మీరాశాలిహోత్రుని యాశ్రమమునందుండగా మీకడకు వ్యాసమునీంద్రుండరుదెంచును.

కుంతి—(తనలో) ఈమె నిజముగా నొక దివ్యవనితయని తోచుచున్న ది. దీనివలన మాకు ముందు బెక్కుపకారంబులగునని తోచు చున్నది. (భీమునింజూచి) వత్సా! భీమా! నీయన్నవాక్యంబులు ను నావాక్యంబులును మన్నించి మేము చెప్పినయట్లొనర్పుము. ఈ హిడింబిని నుపేక్షింపవలదు. ఇయ్యది మహాసాధ్వి. అందుకు సందియంబందక దీనినిఁ జేబట్టుము. (హిడింబినిజూచి) యువ తీమణీ! నీవు శుచివై యుత్తమస్త్రీగుణంబులదాల్చి భీమునకు బ్రియంబుసేయుచుండుము. (భీమునిజూచి) భీమా? యామెను పరిగ్రహింపుము.

భీము—అమ్మా! నీయాజ్ఞ కెదురాడఁజాలను. ఆమెయందు బుత్రిజన్మ మగువరకును నీమెను జేఁబట్టెద.

ధర్మ—హిడింబిచెప్పినయట్లు మనమింక శాలిహోత్రుని యాశ్రమం బున కరుగుదము రండు.

(అందరును నిష్క్రమించుచున్నారు.)

రంగము:—శాలిహోత్రుని యాశ్రమము.

[ప్రవేశము:—భీమార్జున నకుల సహదేవులు—కుంతి—హిడింబి.]

ధర్మ—తమ్ములారా! మనమీ శాలిహోత్రుని యాశ్రమభూమిఁ జేరిననాటనుండియు నెట్టికష్టంబులును లేక సుఖముగ నున్నారము. తమ్ములారా!

మ॥ కనఁడీయుల్లదె దోఁచుచుండెనెనుటన్ ♦ గంభీరకంఠీరవ
ధ్వనితా కర్ణనకంపితాఖిలహరి ♦ ద్భద్రేభసంతాన స
ద్ఘనభల్లూకనికాయ సాళ్వమృగఖ ♦ డ్గ వ్యాఘ్రయుక్తంబు ఘో
రనితాంతాఖిల పక్షిసంకుల రవా ♦ క్రాంతంబు కాంతారముల్.

నకు—అన్నయ్యా! అరణ్యము మాత్రము మనలను విడుచుటలేదు. ఇంతన్న దుష్ట మృగంబులు మనల నేమియు బాధింపవుగదా. వీటి వలన మనకేమియు భయంబుండదుకదా.

అర్జు—తమ్ముఁడా! వీటివలన మనకావంతయు భయంబు కలుగదు. ఏలయనిన;

సీ॥ వైరమింతయు లేక ♦ వరకురంగములకు
బాలిచ్చుచుండెను ♦ వ్యాఘ్రచయము
భీతి యింతయులేక ♦ మృగరాజుతోఁగూడి
వర్తింపుచుండెను ♦ వారణములు
పరమ మదంబున ♦ బావురు పిల్లితో
భుజియింపు చుండెను ♦ మూషకతతి
సాళువంబులముందు ♦ జంకక కేళిని
సలుపుచుండెను పక్షి ♦ సముదయంబు

తే॥ గీ॥ మౌనిచంద్రుని సత్తపో ♦ మహిమచేత

సహ— క్రూర జంతువులయ్యు నె ♦ వ్వారికెపుడు

హాని గూర్పకయుండు నటంచుఁదోచు

నకు— అవును! సందియంబేటికి యనుజులార.

అమ్మహాత్మ్ముని తపఃప్రభావంబున నివి క్రూరజంతువులయ్యు నను నెవ్వరిజోలికిని రావు.

కుంతి—కుమారులారా! ఈ శాలిహోత్రుని యాశ్రమంబున నుండుట మనకు హస్తినాపురియందున్నదానికంటె నెక్కువ సౌఖ్యదాయకంబుగనున్నది.

నకు—అది వైరుల గృహముగదా. అట్టిచో మనకు సౌఖ్యంబులెట్లుండును.

సహ—తల్లీ! నీవుగూడ మా మూలంబున నెట్టి కష్టంబు లందుచుంటివి.

కుంతి—తండ్రులారా! సప్తద్వీపసముద్రముద్రితమహీచక్రంబు నేకచ్ఛత్రంబుగఁ బరిపాలింపఁదగిన బాహుబలపరాక్రమ వంతులును, ధర్మగుణోదారులును నైన మీరే యిడుమలుపడుచుండ నేనా యోర్వలేనిదానను. ధర్మచరిత్రుండైన మీ జనకుండు గతింపగా నేనుగూడ నాయనమార్గమునుబట్టి పోవక మీకష్టంబు లన్నియుఁ జూచుటకు బ్రతికియుంటిని.

హిడిం—అత్తా! కుంతీమహాదేవీ! గతించినదాని కిప్పుడు వగవనేల. ఈ కుమారులనుజూచి యాదుఃఖము నంతయు నీవు దిగమ్రింగవలెను.

కుంతి—కోడలా! హిడింబీ! నేనట్లే తలంచి వీరలను జూచుకొనుచు జింతబాసి యెట్లో దినములు గడుపుదమని తలంచితిని. కాని విధివైపరీత్యంబున దుష్ట దుర్యోధనునిమూలంబున మాకీయిక్కట్లు సంప్రాప్తించినవి. భగవంతుం డింకను నెన్నికడగండ్ల బెట్టనున్నాఁడో యెఱుంగరాదు.

హిడిం—అమ్మా! ఎన్నికడగండ్ల గుడిచినను బావగారైన యీధర్మ
జుండు దాయలను నిర్జించి నల్వురతమ్ములను గలిసి సుఖంబుగ
రాజ్యంబు బరిపాలించును.

ధర్మ—ఇది యెక్కడిమాట!

ఉ॥ ఇమ్మహి నేను భామలను ♦ నెన్నటికైనను వీడగల్గి; మో.
దమ్మును నందగాఁదనరి ♦ తమ్ములు నల్వురు నన్నుగొల్వ మా
యమ్మయు బంధువర్గము; ధ రాధిపులుల్ గనుమెచ్చఁ దండ్రిరా
జ్యమ్మును నేలఁగాఁగలనె ♦ హా! యిఁక నేటికి నిట్టి కోరికల్.

భీము—(కోపముతో దుర్యోధను నుద్దేశించి) అరే! కురుకులపాంసనా!

మ॥ అవనీనిర్జర పాదసేవకుఁడునై ♦ యశ్రాంత మన్యాయ దు
ర్వ్యవసాయాదులు జేరకుండఁగనఁ ♦ బాలింపుచున్నాఁడు ధ
ర్మవిధిన్ ధర్మజుఁడట్టివో; తలపకే ♦ రాజ్యంబు నెల్లన్ గొనం
గ; వనాళిన్ మముఁజేరఁ బంపితివిగాఁ ♦ కష్టాత్మ! దుర్యోధనా!.

ఓరీ! నీచమతీ! అంతటితో బోక కపట మాయంతంబుగూడ జూ
డఁదలంచి వారణాసియందు దొక్క లక్కభవనంబు పురోచనునిచే నిర్మిం
పజేసి యందు మమ్ము బ్రవేశపెట్టించి దాని కగ్నిబెట్టింతువా! (ధర్మ
జునిచూచి) ధర్మనందనా!

సీ॥ ఆటలాడుతఱిని ♦ నీటియందున నన్నుఁ
దోయించి వెలసిన ♦ దుష్టగుణుఁడు
క్రీడాపరిశ్రాంతి ♦ గూడి నిద్రింప స
ర్పము గఱపించిన ♦ పాపహేతుఁడు
నాచావు గనఁగోరి ♦ నాడు విషాన్నంబు
భుజియింపఁజేసిన ♦ పుణ్యహీనుఁ
డందరఁ జంపింప ♦ నాత్మలోపల నెంచి
లక్కయిల్గాల్చిన ♦ మొక్కలీడు

తే॥ గీ॥ కురుకుల ధ్వంసమునకయి ♦ కుతలమందు
దయయు సత్యంబు లేకను ♦ దసరువాఁడు
అట్టి ధార్తరాష్ట్రాగ్రజు ♦ నాత్మలోనఁ
దలఁచినంతనె పాపంబు ♦ గలుగు మనకు.

సహ—అన్నయ్యా! భీమసేనా! నీవు నిజము వక్కాణించితివి!

భీమ—(ధర్మజునిఁజూచి)

మ॥ అనుమానింపక నీకొనర్తు నొక ది ♦ వ్యంబైన విజ్ఞాపనం
బును నామాటలనాలకింపు మిపుడే ♦ పూర్ణ ప్రతాపంబునన్
జని దుర్యోధను సంగరాంగణములోఁ ♦ జక్కాడి యొక్కమ్మడిన్
నిను రాజ్యంబున నిల్పువాడ నవనిన్ ♦ నిక్కంబుగా ధర్మజా.

క్షత్రియులకు రణము ధర్మమైనపనియే గదా. వారు చెప్పినట్లు జేయుటకు మనము క్షాత్రము లేనివారమా. ఈకడగండ్ల మనమేలకుదుర వలయును. నీ వాజ్ఞయిచ్చిన జాలును.

ధర్మ—తే॥ గీ॥ ఆహవంబున కిది సమ ♦ యంబుగాదు
వారియొద్దను పెక్కండ్రు ♦ వీరులుండ్రి
తమ్ముఁడా! కాలముమనకుఁ ♦ దప్పివచ్చె
దాఁగావలెఁ గొన్నాళ్ళు ♦ తప్పకుండ.

భీము—అగ్రజా! కౌరవులపక్షంబున బెక్కండ్రు వీరు లుండిరని నీవు సందియం బందుచుంటివా యేమి! అట్టి సంశయంబు నీవందఁ బనిలేదు. చతుర్దశభువనంబులును నొక్కపెట్టున నెత్తివచ్చినను వెనుదీయక దుర్యోధనుని సనిలోన సోదరయుక్తంబుగా దును మాడి యీ ధరాతలమునకు నిన్నభిషిక్తు జేసెదను.

ధర్మ—అనుజా! నీవంతటివాడవనుట కావంతయు సందియము లేదు. కాని యియ్యది సమయముగాదు. ధర్మంబునకును గాలంబున కును గట్టుబడి యుండవలెను.

భీము—అగ్రజా! నీవు కేవలము వెఱ్ఱివాడవు. నీయాజ్ఞ కెదురాడ జాలను.

హిడింబి—(ఎదుటఁజూచి) అదిగో! మనలను ధన్యులం జేయఁ దలంచి వేదవ్యాసమునీంద్రుం డిట్లు వచ్చుచున్నాఁడు.

కుంతి—హిడింబీ! నీవాక్యంబులు విశ్వసనీయంబులై నవి.

ధర్మ—తమ్ములారా! అమ్మునిచంద్రునకు మనమెదురుగా బోవుదము.

[ వ్యాసుఁడు ప్రవేశించును. ]

వ్యాసుఁడు—(తనలో) ఆహా! ధర్మపరాయణులైన పాండురాజతనూజుల కెట్టి యిక్కట్లు సంప్రాప్తించినవి. వీరి సోదార్యి తగు ధైర్యంబు జెప్పెదగాక.

(అందఱును వ్యాసునకు నమస్కరింపుచున్నారు.)

వ్యాసు—కల్యాణసిద్ధిరస్తు.

ధర్మ—మహర్షితిలకా! సాక్షాద్విష్ణుస్వరూపుండవును, వేదోద్ధారకుండవును, నిరంతరమును మాయభివృద్ధిఁగోరినవాడవును, నగు నీరాకచే మేమెంతయుఁ గృతార్థులమైతిమి.

కుంతి—మహాత్మా! నీమనుమలు పడుచున్నకష్టంబులు జూచితివిగదా అంతటి మహారాజుగర్భమునబుట్టి యింతటియవస్థ పడవలసివచ్చెనుగదా. దాయలగు కౌరవులు సమస్తరాజ్యభోగంబుల ననుభవించుచుండ, వారితోసమానంబుగ నుండవలసినవారీకాననంబున దిక్కులేనిపక్షులవలె చరింపవలసినగతి పట్టినది.

వ్యాసు—అమ్మాయీ! కుంతీ! భగవత్సంకల్పమున కెవ్వరును కర్తలుగారు. మిమ్ము రాజ్యంబునుండి వెడలనడపి యాకౌరవులందఱునుబొందు సౌఖ్యంబులుమాత్రి మేమున్నవి.

తే॥ గీ॥ నిమ్మభూజంబునకునెంత ♦ నీరునిడిన
బ్రతుకుటరుము బ్రతికినను ♦ ఫలముఁలరుదు

యడవిలోఁ రతి లేనట్టి ♦ యఖిలతరులు
వృద్ధిజెందుటలేదె స ♦ మృద్ధిగాను.

మీ రేప్రదేశమునందుండినను శ్రీహరి మిమ్ముల నిరంతరంబు ను గాపాడుచుండును. వత్సలారా!

చం॥ కొంకుకువచించువాక్యములు ♦ గూడవటంచునిరాకరింపకే
కడువడియాపదల్ పొరయ ♦ గాదటినేర్మి ధృతరాష్ట్రుఁడంచునే
ర్పడవిని మీరలాపదల ♦ పాల్పడకుండ హితోపదేశ మి
మ్మెడనెనరించి పోదలఁచి ♦ నే నరుదెంచితి సత్వరమ్ముగన్.

ధర్మ—మహాత్మా! నీకు మాయందున్న ప్రేమ వర్ణనాతీతముగదా.

వ్యాసు—కుమారులారా! మీరు నావాక్యంబులాలించి కొన్ని దినంబులు ప్రచ్ఛన్నవేషంబులనుండుడు. దానివలన మీకు లాభంబు గలుగగలదు. ఈశాలిహోత్రుని యాశ్రమంబుననుండిన జలజాకరంబున జలంబును మీరు ద్రావియుంటచే మీఁకాకలిదప్పు లడంగినవిగదా. మదీయవరప్రభావంబున మీకు సమస్తవేదవిద్యయు నలవడును. ఇంక గొన్నిదినంబులీ శాలిహోత్రుని యాశ్రమంబుననుండి యనంతర మేకచక్రపురంబున కరుగుఁడు. అచ్చట మీరు భైక్షుకవృత్తిని జరిఁపుచు నారాకకై ప్రతీక్షింపుచుండుడు. మిమ్ములను నేను మరల నచ్చట జూచెదను. (హిడింబినిజూచి) ఈహిడింబి పూర్వజన్మంబున గమలపాలిక యను నామంబున దనరినది. ఇదియొక దివ్యవనిత. దీనిని వేరు విధంబుగ భావింపవలదు. దీనియందు మహాభుజబలపరాక్రమ సంపన్నుఁడగు కొమరుఁ భీమున కుదయించును. అతడు మీకనేక కార్యంబులయందు బెక్కుసహాయంబు లాచరించును. ఇక నే నరిగెద.

ధర్మ—పితామహా! నీవు నిరంతరంబును మాక్షేమంబు నారయుచు మమ్మ రక్షింపుచుండుము.

వ్యాసు—వత్సలారా! మీకెట్టియాపదలును జేరకుండుగాక. ఇంక నే నరిగెదను. (నిష్క్రమించుచు)

ధర్మ—తమ్ములారా! వింటిరిగదా. వ్యాసమునీంద్రునివాక్యంబులు. ఏకచక్రపురంబున మనలను బ్రాహ్మణవేషంబులను దాల్చి భైక్షుక వృత్తిని జరింపుమని యాజ్ఞయొసంగినాడు. అక్కటా! కాలమె ట్లుమారినది.

భీము—అన్నయ్యా! దీనికి విచారింపవలసిన యవసరమేమున్నది!

ధర్మ—నావిషయమై నేనంతగా విచారింపనుగాని,

తే॥ గీ॥ పృథ్వినేలఁగాఁదగినట్టి ♦ వీరు; నిన్ను
బేదవిప్రునిమాడ్కి-ని ♦ బిచ్చమెత్తు,
మంచు నేరీతినీకు వ ♦ చించుపాడ
నక్కటా! యెట్టిగతివచ్చె ♦ ననుజ! మనకు.

భీము—నావిషయమై నీవు చింతనంతవలదు. మంచిదినంబులువచ్చు వఱకును నోపికబట్టి యుండవలెను. కాలమెప్పుడును నొకతీరున నుండదుగదా.

ధర్మ—(అర్జునునిజూచి)

తే॥ గీ॥ ద్రోణునాజ్ఞనుబూని యా ♦ ద్రుపదనృపుని
రథమునకుఁగట్టితెచ్చి వి ♦ రాదలీల
నస్త్రవిద్యావిశారదుం ♦ డనుచుఁ బేరు
గాంచి విమలయశంబును ♦ గాంచినావు.

అట్టినిన్ను బ్రాహ్మణునివేషంబునుబూని భైక్షుకవృత్తినిఁ జరి యింపుమని యెట్లుజెప్పుదునాయని నందియుమ్మగలుగుచున్నది.

అర్జు—అన్నయ్యా,

తే॥ గీ॥ “ఓడలేబండ్లగును బండ్లు • లోడలగును”
కాలమొకరీతినెవ్వరు • గడుపగలరు
చింతయేటికినీకును • స్వాంతమందు
మహితగుణతేజ ధర్మజ • తాల్మితలేంద్రి.

సురమునిగణపూజితుండగు వ్యాసుండుచెప్పిన తెఱంగున మనము బ్రవర్తింపవలయును. నన్నుంగూర్చి విచారింపవలదు.

ధర్మ—(నకులసహదేవులనుజూచి)

తే॥ గీ॥ మాద్రికోర్కెమై మిముగాంచి • మరణమందె
సశ్వినులభాతి మీరుచు • నలరుచుండ్రి
యక్కటా సుకుమారులై • నట్టిమిమ్ము
దేవభిక్షుకుఁబొమ్మంచు • దెలుపగలనె.

భగవంతుండు మనకెట్టికష్టంబుల జేయుచున్నాఁడు.

నకు—అగ్రజా! విధియాజ్ఞ నుల్లంఘించుటకు మనతరమా. ఏదియెట్లు జరుగుటకు విధాత వ్రాసినాడో యట్లే తప్పక జరుగుచుండును. నీవు దీనికై యోచింపవలదు.

సహ—అన్నయ్యా, మనకుఁ గాలాతీతమగుచున్నది. శాలిహోత్రముని చంద్రిందును నరుదెంచు వేళయైనది.

ధర్మ—అట్లయిన నాతనిని దర్శించి యతండెప్పు డేకచక్రపురంబున కరుగుమని చెప్పిన నరుగుదము. రండు.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.

సంపూర్ణము.



శ్రీ

# ద్రౌపదీపరిణయము.

## తృతీయాంకము.

[రంగము:—ఏకచక్రపురము:—ప్రవేశము జాబాలియను భూసురుండును, భార్గవియను భార్యయు, చారుమతియను పుత్త్రికయు, సునందుఁడను పుత్త్రుఁడును, బ్రవేశించుచున్నారు.]

జాబాలి—(తనలో విచారించుచు) అక్కటా! భగవంతా! మాయింత ముచూడఁదలంచితివా! ఆబకునకాహారంబుగాఁబోవుటకు నేఁడు మాయింటి వంతువచ్చినది—అక్కటా! ఇప్పుడు నే నేమి సేయుదును. ఎవ్వరిని నా రాక్షసున కాహారంబుగాఁ బంపుదును. అగ్నిసాక్షిగ బెండ్లియాడిన యీ కాంతను బంపుదునా. నామరణాంతమున నాకిన్నినీళ్ళుచుక్కలను బోయుచు వంశవృద్ధికి గారణుండగునని తలంచి నాయాసలన్నియు నెవనిపై నిలిపితినో యట్టికుమారుని బంపుదునా? చక్కనివరుని వివాహమాడి మావంశంబునకు సుకీర్తిఁదెచ్చునని నమ్మియున్న సుగుణచరిత్రయగు కుమారినంపుదునా. లేక నేనేయరుగుదునా! అయ్యో! నిరంతరమును నన్నే దైవముగాభావించుచు, నొక్క త్రుటికాలమయినను నన్నెడబాయక, సాధ్వీలోకంబున విమలకీర్తిఁగడించిన భార్యనుబంపుటకు నాచిత్తంబెట్లుసమ్మతించును. నిజగర్భసంభవయగు పుత్త్రిక నర్పించుటకు జేతులెట్లాడును. కన్నకుమారుని నర్పింతమనితలంచినచో నయ్యది వంశవిచ్ఛేదనంబునకు

మూలంబగుగదా. పోనిమ్ము. నేనే యరుగుదుఁ(మనితలంచినచో నాత్మహత్యాదోషంబునకు బాల్పడినవాడనగుదును. అయ్యో! ఏమిసేయుటకును దోఁచకున్నది. మమ్మీమహావిపదాబ్ధినుండి యెవ్వరు తరింపఁజేయఁగలరు. ఎవ్వరిని వేఁడుకొందును. ఇట్టిసమయంబున మాకెవ్వరడ్డపడుదురు. (భగవంతుని నుద్దేశించి) హా దైవమా!

విచారవల్లరి.

సురగణనుతమా ♦ శోకమువినుమా
సరగునమమునీ ♦ సత్కృపగనుమా
సురరిపువలనన్ ♦ సాక్షిగనిపుడే
యరుగఁగవలెమా ♦ యార్తి నివినవా.

అయ్యో! దైవమా! ఎట్లో వైదీకవృత్తిచేఁ గాలంబుగడుపుచు నీకుమారుని, కుమారికను జూచుకొనుచు నానందమందుచు దినములు వెళ్ళబుచ్చుచుండగా మాకిట్టియాపద గూర్చుట నీకు ధర్మమా! నిరంతరము నీపదారవిందసేవదప్ప యన్య మెఱుంగనివాడనుగదా. దేవా! కూటసాక్ష్యంబులేమైన నొసంగి యెవ్వరికొంపనైనను మాపియుంటినా! ద్రవ్యంబునకాశించి యెవ్వరిగొంతుకనైన రహస్యంబుగ గోసియుంటినా! చంచలచిత్తుండనై పరునికాంతను గూడితినా! సిరితోదులఁదూఁగుచుంటినని గర్వాంధకారంబున మునిఁగి నీపాదసేవమఱచియుంటినా! ఇట్టికార్యంబుల నెన్నఁడును జేసియెఱుఁగని నన్నిట్టిసంకటంబుల పాలు జేయనేల!

పార్వ——నాథా! ఏలమీరిట్లుచింతించెదరు. చింతించినందువలనఁ బ్రయోజనంబేమియున్నది.

తే॥ గీ॥ భూరివిపదాబ్ధిలోపల ♦ మునిఁగినాము
దానిఁదరియింపమనకును ♦ దరమ్ముగాదు

చింతనేటికిజేర్తుపు ♦ చిత్తమందు
నసురవాతకు నన్పంపు ♦ డమలచరిత.

ఆదైత్యునకు నే నాహారంబయ్యెద. మీరు చింతింపవలదు. న్యాయంబు బడయవలసిన సంతతి నిదివఱకే బడసియుండిరి. వంశంబు వృద్ధిసేయఁదగిన నందను డొకఁడున్నాఁడు. అదిగో పుత్త్రికయున్నది.

చం॥ ఘనుఁడగు వానినొక్కనిని ♦ గన్నకుఁ బెండిలిజేసి; మీఱుసుమా.
వనజదళాయతాక్షుసుర ♦ వందితు శ్రీరమణీమనోహరున్
మనమునభక్తి మీఱఁగను ♦ మానకగొల్చుచు నెట్టులెట్టులో
దినములు వెళ్ళదీయుఁడుము ♦ దిక్కనుమయ్యెఁడు పుత్త్రిఁజూచుచున్.

ఇంక జాగుజేయక నసురునికడ కరుగుటకు నాకానతిండు.

జాబా—(దుఃఖముతో) హా! సతీమణీ! ఎంతదారుణపు వాక్యంబుల బలికితివి. నవ్వులాటకునైనను నెప్పరిని నొవ్వనాడని సుచరిత్రవు. పరిహాసమునకైనను నసత్యంబు బలుకనిదానవు. కలయందైనను నాసేవ విడనాడి యెఱుంగనిదానవు. అక్కటా! మంత్రయుక్తంబుగ నగ్నిహోత్రినిముందు నర్ధాంగిగజేకొనిన నిన్ను నేనెట్లు బాయగలను. సాధ్వీమణీ! నిన్నాయసురుని వాతకు బాల్పడుమని చెప్పుటకు నాకు నోరెట్లాడును ఆయసురుని కాహారంబుగా నే నరిగెదను. పుత్త్రిని పుత్త్రికను జూచుకొనుచు గాలంబు వెళ్ళదీయుము.

పార్వ—ప్రాణేశ్వరా! మీ రరుగవలదు. జీవనంబులు బరిత్యజించియైనను భార్య, భర్తకు హితంబుసేయుట పరమధర్మమై యున్నది. మఱియును,

తే॥ గీ॥ కాంతుకంటెను మున్ను స్వ ♦ ర్గంబుజేరు
చాన లోకంబునందు య ♦ శంబునందు

భర్తృహీనయై జగమందు ♦ బ్రతుకు కాంత
సాధ్వియయ్యును జూడఁబడు న♦ సహ్యముగను.

తే॥ గీ॥ జాతి పడిపోయినట్టి మూం ♦ సంబుకొఱకు
పక్షు లాసించువిధమున ♦ భర్తృహీన
యైన యువిదకొఱకు హీను ♦ లాసజెందు
చుండు రిదిపాప మనకను ♦ డెందమందు.

ఇంతియేగాక సతి గతియించె నేని పురుషునకు బునర్దారాసంగ్రహము శాస్త్రసమ్మతమై యున్నది. అంతియేగాని కాంతకు బతి విముక్తుం డయ్యె నేని యన్యపురుష సంగ్రహమున్న కధికారము లేదు. మీరు లేకున్న యీజగంబున నేనొక్క క్షణకాలంబయినను జీవింపజాలను.

చారు—తల్లిదండ్రులారా! ఏల యీరీతి మీరు శోకంబునందుదురు. నన్ను మీ రెంతకాలము పెంచినను నేను మీదాన నుగాను. నేనొరుల ధనంబునై యుంటిని. అట్టియెడల నొరుల కిచ్చుట కన్న మీ ప్రాణసంరక్షణార్థమై నన్నా యసురున కాహారంబుగాఁ బంపుడు. తండ్రియొనరించు తిలాదిదానవిధులు పరలోకంబునను పుత్రికను జెందును; గాని పుత్రు డొనరించు విధులుమాత్రము తల్లిదండ్రులను జెందవు. అయ్యవి దానిపురుషునే జెందును. మీకు నాయందుగలుగు దౌహిత్రలాభంబుకంటె మీ రిరువురును బ్రతికియుంటిరేని యనేక పుత్రప్రాప్తిలాభంబు నందగలరు. దానంజేసి కులము నిలచును. ఇంక సందియంబందక నన్ను బంపుఁడు.

జాబా—కులమునకుఁ గీర్తిదెత్తువని తలంచి యాసతో నున్న వాఁడ. నిన్నెట్లు బంపుదును. బిడ్డా నీవేగవలదు. నేనేయరిగెదను.

సువిం—తల్లిదండ్రులారా! మీ రెవ్వ రరిగినను బ్రయోజనము లేదు. ఆ దుష్టరక్కసునిచీల్చ మడంపదగిన మహిమ మీయొద్ద లేదు. నేనరిగి వానిని యీకోలచేఁగూల్చి వచ్చెదను. నన్నుఁబంపుఁడు.

జాబా—కుమారా! నీవారక్కసుని గూల్పఁదగినంతటి పరాక్రమవంతుండవా! (భార్యనుజూచి) రమణీమణీ! ఎందు కీయాలస్యము. ఆలస్యమయ్యెనేని యారక్కసుండు పురిలోని కరుదెంచును. కావున నే నరిగెదను.

పార్వ—అయ్యో! మీ రరుగవలదు.

తే॥ గీ॥ పురుషు లుండకయున్నచోఁ • బాలతియెట్లు
ఉద్ధరించును సంసార • ముర్వియందు
నసుర కాహార మగుటకే • నరుగుదాన
గాఁచుచుండుడు వీరిని • ఘనతరముగ. (పోఁబోవును.)

జాబా—కాంతా నీ వేగవలదు.

చారు—అమ్మా! నీవు వలదు. నే నరిగెదను.

సునం—మీ రెవ్వరునువద్దు. నేనే యరిగెదను.

పార్వ—నాథా! బిడ్డలను జూచుకొనుచుండుడు. నే నరిగెదను.

జాబా—(భార్యను బట్టుకొని)

జగన్మోహిని.

చాలుఁజాలునింక • జాలమేలనే సఖి జాలమేలనే
బేలలీలనిట్లు • భీతియొందుకే చెలీ భీతియొందుకే
మాలదైవమిట్టి • పాట్లు దెచ్చెనే సతీ పాట్లుదెచ్చెనే
యేలచింత నేనె • యేగివచ్చెదన్ ప్రియా యేగివచ్చెదన్

[అంత కుంతి ప్రవేశించుచున్నది.]

కుంతి—(తనలో) ఎందుకోగాని పాపమీయింటిలోని భూసురుండు తన భార్యబిడ్డలతో గూడ మిగుల దుఃఖించుచున్నాఁడు. ఇందులకు

గారణంబేమైయుండునోగదా. సరే. వీరినడిగి తెలిసికొని చేత
నైనచోఁ దగుసహాయ మాచరించెదను. "పరోపకారార్థ మి
దంశరీర" మని పెద్దలు చెప్పియుండిరిగదా! (బ్రాహ్మణుని
సమీపించి) బ్రాహ్మణోత్తమా! మీరీరీతి చింతించుటకు గార
ణంబేమియో నే నెఱుంగవచ్చునా!

జాబా—అయ్యో! తల్లీ! వినినను వినకపోయినను యేమిప్రయోజనము
న్నది. నేటితో మాకు గాలముదీఱినది. (వగచుచున్నాఁడు.)

కుంతి—భూసురవర్యా! చింతింపవలదు. మీ యాపదయెట్టిదో తెలి
య జేసితిరేని దానికిందగిన ప్రతీకార మాలోచించవచ్చును. త్వ
రితముగఁ జెప్పుము.

జాబా—అమ్మా! ఏమనిజెప్పుదును. ఈపురంబునకు నాలుగుక్రోసుల
దూరంబున యమునానదీగ్వారంబున బకుండను దానవుం డొ
క్కఁడునివాసముజేయుచున్నాఁడు. ఆకౄరాత్ముండుదప్పించి పురి
లోనికి విచ్చలవిడిగాఁ బ్రవేశించి యిచ్చవచ్చినయట్లు యీపుర
వాసులను జంపుచుండ, సాధుగుణులైన భూసురులు జపహో
మదానవిధులంజేసి, యారక్కసునితో నిట్లనుదినంబును పురంబు,
నకరుదెంచి జనహింససేయుట వలదనియు, నింకనుండి ప్రతిది
నంబును నిలువరుస నొక్కమానిసిని రెండెనుబోతులంబూనిన శ
కటంబున నపరిమితభక్ష్యపిశితమిశ్రాన్నంబును బంపబడుచుం
డుననియు వానితో నొడంబడిక జేసికొనిరి. ఆయొడంబడిక
ననుసరించి ప్రతిదినంబును నట్లు జరుగుచున్నది. తల్లీ! నేడు
వానికాహారంబుగాబోవుట మాయింటివంతై యున్నది. పెద్ద
కాలంబునకు నాకుజన్మించిన యీకుమారుని బంపజాలను. కు
లమునకు గీర్తిఁదెచ్చునని తలంపుచున్న యీకుమారిసి బం
పజాల. మంత్రయుక్తంబుగ నగ్నిహోత్రనియమం దర్థాంగిగ

స్వీకరించిన యిక్కాంత నను పఁజాల. అందులకై నేనే పోయెదను !

కుంతి—ఓ ! ధరామరా ! నీవింక నాసంగతింగూర్చి చింతింపవలదు. నీకు బెద్దకాలంబునకుజనించిన యీ కొమరుం డొక్కఁడేయున్నవాడు. ఆతనిం బంపవలదు. నాకేవురుతనయులున్నారు. కావున నారక్కసునకు భవదర్థంబు మెక్కరుండు బలిగొనుపోవును. ఇందులకై మీరు సందియంబందవలదు.

జాబా—తల్లీ! ఎంతమాటజెప్పితివి !

తే॥ గీ॥ అతిథియైవచ్చినట్టి ధ • రామరునిటు
నసురకాహారముగను జే • యంగనెంతు
విప్రమరణంబుదలపోయ • బృధ్వియుండు
బెద్దపాతకంబగుచును • వెలయుఁగాదె.

అతిథిని, నభ్యాగతుని, భయస్థుని, శరణాగతుని జంపుటకు సమ్మతించుదురాత్ముఁడిహపరంబులకు దూరంబగును. ఆత్మహత్యకూడ మహాపాతకంబని యార్యులు నుడువుదురుగాని యియ్యది యొరులచే జేయింపబడుచుండెనుగాన నన్నాపాపంబంటదు. ఎవరిమూలమున నే నిట్టి ఘోరకార్యముచేయుట కొడంబడితినో వారినే యంటును. కావున బ్రాహ్మణవధకు నే నంగీకరింపఁజాల.

కుంతి—ఓయీ ! వెఱ్ఱిబ్రాహ్మణుఁడా ! నేనుమాత్రము బ్రాహ్మణ వధకు సమ్మతింతునని దలంచితివా ! ఈసంగతి నాకుమాత్రము దెలియదా. నాకుమారుని వధించుటకా దానవునకు శక్యంబుగాదు. దుర్మార్గుండగు నారక్కసుని రణంబున నాసుతుండు తప్పక యోర్చునని యెఱింగినదాననగుటచేత నే యట్టికార్యము నేయఁబూనితిని. అంతియెగాని నూర్వురుసుతులున్నవారె నన్ను

నందొకరివధకు సమ్మతించువా రెవ్వరుందురు. నాద్వితీయతన
యునిచే నింతకుమున్నే పెక్కండ్రురక్కసులు మడిసిరి. ఈతఁ
డొక మంత్రసిద్ధుఁడు.

[(అంత భీముండు ప్రవేశించును ]

భీము——(కుంతిని జూచి) తల్లీ! వీరి విచారంబునకు గారణం బరసితివా ?

కుంతి——వత్సా! కనుఁగొంటిని. ఇచ్చటి కనతిదూరంబునందున్న బకా
సురుండను దానవుని కీలువరుస ననుసరించి యీబ్రాహ్మణుం
డాహారంబుగా బోవలయునఁట. అందుకై వీరు శోకింపుచున్నా
రు. కావున నీవు రెండెనుబోతులం బూన్చిన శకటంబుపై నాహా
రంబు బెట్టుకొని యా యసురునికడ కరిగి వానినిజంపి వీరిని గా
పాడవలయును.

భీము——అమ్మా! ఇంతియేగదా. తప్పక నీయాజ్ఞ ననుసరించెద. (బ్రా
హ్మణుజూచి)

మ॥ ఘనసాధ్వీమణివైన నాజనని యా ♦ జ్ఞన్ బూనితిన్ నాకునై
యనుమానింపకు మింక నీదుమదిలో ♦ నాదైత్యు డున్నట్టి తా
వునకున్ బోయెద నేనె శీఘ్రగతి సం ♦ పూర్ణప్రతాపంబుతో
దనుజున్ గూల్చెద నేకచక్రపురి మో ♦ దంబంది శ్లాఘింపఁగన్.

ఓ ధరామరోత్తమా! నాభుజపరాక్రమమునుగూర్చి నీకొక్కింత
యు దెలియదు. ఆతండేగాక చదుర్దశభువనంబులును నొక్కపెట్టున
నెత్తివచ్చినను నిసుమంతయు భీతిల్లువాడనుగాను. మీరరిగి యాబకు
నకు గావలసిన యాహారాదికంబులు సిద్ధముసేయుడు.

(బ్రాహ్మణుఁడు భార్యాపుత్రులతో నిష్క్రమించును.)

[ధర్మజుఁడు ప్రవేశించును.]

ధర్మ——(కుంతినిజూచి) అమ్మా! మధూకరాన్నము దెచ్చితిమి.

కుంతి—తక్కినతమ్ములు ముగ్గురును నేరి!

ధర్మ—అచ్చట గూర్చుండియున్నవారు. (భీమునింజూచి) అమ్మా! మన భీముని వదనంబు నేడది యొకతీఱున నున్న దేమికారణము.

కుంతి—బ్రాహ్మణప్రాణ సంరక్షణార్థమై నేడు బకాసురుని సంహరింపదలంచినాడు.

ధర్మ—వాయునందనా! మఱల నేదియో సాహసకార్యము బూనితివా!

కుంతి—వత్సా! ధర్మతనూభవా! ఈయింటిభూసురుని శోకంబు గనలేర జూడజాలక నీభీముని నిట్టియుద్యోగంబున నేనే బ్రేరేపించితిని.

ధర్మ—అమ్మా! నీవు ముందువెనుక లాలోచించకుండ నెట్టికార్యము-నీతనిచే జేయింపఁదలంచితివి? ఇది కేవలము సాహసమునుమా!

సీ॥ దుష్టగుణుండైన ♦ దుర్యోధనుడు మాయ
లెన్నెన్నొ యాయంధ ♦ నృపునితోడ
బల్కి మనలను నా ♦ వారణాసికిఁబంపి
యచ్చటనెవ్వరు దెలి ♦ యంగలేని
లక్కతో దివ్యమా ♦ నొక్కయిల్లును జేసి
మనలనందుంచి బ ♦ ల్మాయచేత
దావాగ్ని బెట్టించె ♦ దానికి ; నప్పుడు
వాయుజుడు మనల ♦ బ్రతుకజేయ

తే॥ గీ॥ నంటుకొన్నట్టి యాలక్క ♦ యింటినుండి
సరగదప్పించి మించెను; ♦ శౌర్యమెసఁగ
ఘోరవనమందున హిడింబుఁ ♦ గూల్చిమనకు
నధికసంతోషమునుగూర్చె ♦ నట్టిభీము
విడువనెంచుటభావ్యమే ♦ వెఱ్ఱివగుచు,

కుంతి—కుమారా! కొడుకుమువికు మట కంత వెఱ్ఱిదాననుగాను. ఈతని శక్తి నే నెరుంగనిదిగాదు. ఈతండు వజ్రకాయుండు. వజ్రధ గండైన విబుధేంద్రునిగూడ నెదురింపఁదగినబలశాలి. ఈతని గన్న పదియునదివసంబున నాయొడినుండిజారి పర్వతంబుపై బడగా నీతనిశరీరముదాకి యాశిలలన్నియు నుగ్గయినవి. బ్రాహ్మణులకు నిరంతరమును మనము బ్రియముసేయుచుండవలయును. మీరట్లు గావించితిరేని వారిప్రసాదంబున నీవును నీసోదరులును నిరంతరసౌఖ్య శ్రీలనందుదురు.

ధర్మ—అమ్మా నీబ్రాహ్మణభక్తికి సంతసించితిని. బలశాలియగు తమ్మునికెందును నే కొఱంతయుగలుగక విజయంబే లభించుగాక!

భీము—అన్నయ్యా! భవదమోఘాశీర్వచనంబు ఫలించుగాక! (ఎదుట జూచి) అదిగో విప్రుండరుదెంచుచున్నాఁడు.

జాబాలి—(ప్రవేశించి) ఓ వీరపురుషా! నీయనుమతిని నన్నియు సిద్ధము జేసితిని.

భీము—(కుంతినిజూచి) అమ్మా!

శా॥ ఉల్లాసంబున వీరు మెచ్చఁగను న ♦ య్యుగ్రహావక్రీడలో
ముల్లోకంబుల నేచుపాతకుని వే ♦ భోకార్చి యేతెంచెదన్
దల్లీ యన్నముపిండివంటకము మో ♦ దంబొప్పఁ బెట్టింపుమీ
యుల్లి బియ్యొడ నాబకాసురవధో ♦ ద్యోగంబునన్ మించెదన్.

జాబా—(భీమునిఁజూచి) బలశాలీ! బ్రాహ్మణోత్తమా! ఇంతమాత్రమునకు నీవు మీతల్లినడుగనలయునా. మాప్రాణంబుల సంరక్షించి వంశంబు నిలబెట్టదలంచి, ఘోరకార్యము భుజస్కంధమునందు వహించియున్న నీకు గడుపునిండ నన్నముబెట్ట నేను సమర్థుండనుగానా! ప్రాణదాతా! రమ్ము. ముందునీకేమికావ

లయునో యట్టి దేకొంతయు లేకుండ గడుపునిండ భుజింపుము. (భీమునిచేయిబట్టుకొని తీసికొనిపోవుచున్నాఁడు.)

ధర్మ—అమ్మా మేముదెచ్చిన మధూకరాన్నము మాకు బంచిపెట్టెదవుగాక! రమ్మ.

కుంతి—మంచిది.

(నిష్క్రమించుచున్నారు.)

రంగము—బకాసురునిగహ్వరము.

బకాసురుఁడు—(కోపముతో బ్రవేశించి) ఔరౌరా! ఏమీ! ఈయేకచక్రపురవాసుల యవిధేయత. ప్రతిదినంబును సిలువరుస నొకమానిసిని రెండెనుబోతులనుబూనిన శకటంబున దానికిదగిన యాహారమును బంపుదుమని చెప్పుటచే జాలిదలంచి యిందుల కొప్పుకొంటిని. అనుదినంబును వారిది పంపునప్పు డొక్కింత యాలస్యమైనను నాగ్రహింపక యెట్లో తాళుచుంటిని. నేఁడే మియోగాని నా కాహారంబుబంపుటయందు మిగుల జాగుచేసినారు. అహా! అకలిబాధ కడుపుదహించివేయుచున్నది. (కోపమున) ఓ! యేకచక్రపురనివాసులారా! మీరు నన్ను మఱచిపోయిరికాబోలు. దుర్మతులారా! మీరు మఱచిపోయినను యీ బకుండుమాత్రము మిమ్ములను మఱచువాడుకాఁడని తలంపుఁడు. మీపురంబెల్ల నిమేషకాలంబులో భస్మముగావించెద.

[అంత భీముఁడు శకటంబుతో బ్రవేశించును.]

భీమ—(తనలో) ఇప్పటి కిక్కడ జేరుకొంటిని. అనుదినమును నీ రక్కసున కాహారము వచ్చు వేళకంటె నేను మిగుల యాలస్యమైయుండుటచేత వాఁడు చిందులుద్రొక్కుచు నేయుండును. (ఎదుట జూచి) అదుగో! అక్షీణరూక్షేక్షణవీక్షణంబుల త్రైలోక్యం

బులును భస్మము గావించునట్లు, తన కాహారమువచ్చు వేళ మిగిలినదని యీ మృక్కడి రక్కసుండుదురాగ్రహంబున కేకలు బెట్టుచున్నాడు. కావున్ను. వీని యంతంబొందించు కాలము సమీపించు చున్నది. (నలుదెసలం గలయజూచి) శల్య మాంస చర్మశోణిత దుర్గంధ పంకమైన వీని గవ్హారంబును నేను సమీపించుటకన్న నే నిచ్చటనే యీ శకటంబుయొద్ద నుండెద ను. వీడే నన్ను జూచి రాగలడు.

చం॥ మదిని సుమంతయేని యను • మానము బూనక దల్లియాజ్ఞ; దు
ర్మదుడగు వీనిదాకి సమ • రంబున ద్రుళ్ళడగించిపుచ్చి స
మ్మదమునొసంగెదన్ విమల • భూసురుడంతయు నన్ను మెచ్చ; నె
మ్మదులను నేకచక్రపుర • మాన్యులు చింతల బాసియుండగన్.

(ఇంచుక యూరకుండి) భగవంతా! వాసుదేవా! ఆనాడు కౌరవు లగ్ని బెట్టించిన లక్కయింటనుండి నీ కరుణచేతనే జననీ సోదరులను దప్పించి యడవి చేర్చితిని. నీ యమూల్య కారుణ్యముచేతనే జననీసోదరులు నిద్రింపుచుండగా నట్టహాసంబున వచ్చుచున్న హిడింబాసురుని దునుమాడ గల్గితిని. దేవా! నేనిప్పుడొక నిర్భరమైన కార్యంబును బూనినాను. తల్లి యాజ్ఞ ననుసరించి బ్రాహ్మణప్రాణ సంరక్షణార్థమై లోకకంటకుండైన యీ బకాసురుని వధింపనుంటిని గావున నాయందు కృపాంతరంగుండవై యీకార్యంబు కొనసాగునట్లుజేసి, నీమనస్త కుమారులకు గీర్తిదెమ్ము.

బకా—(ఎదుటం జూచి) అదుగో! యెవ్వడో మానిసి యాహారసమేతముగా శకటంబును దెచ్చినాడు. (ప్రకాశముగా) ఓరీ! మనుష్యాధమా! నేడింత యాలస్యము చేసితివేమి! మీరీ రీతి గావించినచో నేకచక్రపురవాసుల నందఱిని నొక్క దినముననే

యాహారముగా గొందుననుమాట మఱచితివా యేమి! అయి
నను నా కాహారంబగుటకు వచ్చిన నీపై నాగ్రహించిన నేమి
ప్రయోజనంబున్నది. రమ్ము. నా కాకలియగుచున్నది.

భీము—(తనలో) ఈ క్రివ్యాదుం డాకలిబాధచే నేమేమో ప్రేలుచు
న్నాఁడు. వీనికి గాలమాసన్నమైనది. వీని వాక్యంబులు నేను
విననట్లు నటించెదనుగాక! వాడిక్కడ కరుదెంచులోపల యిం
దున్న పదార్థంబులు నేను భుజియింపుచుండెదను. (శకటంబు
పై నున్న భక్ష్యంబుల దినుచుండును.)

బకా—(భీమునిజూచి) అరే మూర్ఖా! సత్వరమ్ముగా రమ్మని పిలుచు
చుండ నా వాక్యములు వినిపించుకొనవేల. (పరికించి) మాట
వినిపించుకొనకుండుటయేగాక నాకై తెచ్చిన యాహారంబు నీవు
భుజింపుచుంటివా! అహరా! ఏమి నీ ధైర్యము. ఇదిగో
వచ్చుచున్నాను.

భీము—రమ్ము. రమ్ము. నిన్ను నా భుజములసందున నిఱికించి తృటి
లోఁ జంపెద.

బకా—(భీముని సమీపించి) ఏమిదీ! మిగుల నాశ్చర్యముగా నున్నది!
త్రిలోక భయంకరుండనగు నన్నుజూచి వీఁడొక్కింతయైనను
జలింపకయున్నాఁడు, కానిమ్ము. వీనిమద మడగించెదను.
అరే! దురాత్మా! అరే మర్త్యాధమా! ఏమిరా నీ కండకావర
ము. మనుష్యమాంసభక్షకుండనైన నాకు భీతిల్లి యనుదినం
బును నేకచక్రపురవాసులు నాకాహారంబు బంపుచుండురు. నీవు
నేడు నాకాహారము మిగుల నాలస్యముగా దెచ్చుటయేగాక,
నాకు వెఱవకుండ నయ్యది నీవె తినుచుంటివా. (అని
తన్నును.)

భీము.—(తన్నును లక్ష్యముసేయక) ఇదిగో! యీ యాహారములో తక్కిన భాగముగూడ భుజించి వచ్చుచున్నాను. తొందరపడ వలదు.

బకా.—(తనలో) ఏమిది! నా వాక్యంబుల కెవ్వడును నీరీతిని బ్రత్యుత్తరం బిచ్చినవాఁడు లేఁడు. వీఁ డెవడో యించుక చేవగలిగిన మానిసివలె దోఁచుచున్నాఁడు. అది యెట్టిదో యించుక గనుఁగొనవలయును. (ప్రకాశముగా) ఓరీ! మనుష్యాధమా! ఏమిరా పిలుచుంటివి?

భీము.—ఓరీ! దైత్యాధమా!

ఉ॥ చాలునుజాలు మాయుమిఁక ♦ జక్కగ నీదగు నోరు విప్పు; వా
చాలతనేల జూపెదవు ♦ బాహుబలంబును జూపనెంచుమీ
కాలునిలీల వచ్చితిని ♦ గ్రన్ననినిన్ను వధింపనెంచి యో
బాలిశ! యేకచక్రపుర ♦ వాసులు సంతతము సుఖింపగన్.

బకా.—(భీమునిఁజూచి)

ఉ॥ ఎవ్వఁడవోరి నీవిటుల ♦ హీనపరాక్రమమున్న రీతిని
జివ్వకుఁగాలు ద్రివ్వెదవు ♦ ఛీ! యటు నిల్వుము; దేవబృందమే
యెవ్విధి యీ బకాసురుని ♦ నిబ్బువిలోపల గూల్తుమంచు వా
రవ్విధి వేడికొందురు భ ♦ యంబుల జెందుచు మానసంబులన్.'

స్వర్గమర్త్య పాతాళ లోకంబులయందు నన్నెదిరించి నిల్చువీరుండు లేఁడు. అట్టి యెడల స్వాంతంబున భయమింతయైనను లేక నా యెదుట నిల్చి యీరీతిని బలుకుచుంటివి! ఎటులైనను నీని కాహారం బగుటకు నేతెంచితివిగదాయని తలంచి, కొన్ని పౌరుషవాక్యంబులాడిన పిదపనే చచ్చుటకు దలంచి యిట్లు కారులు పేలుచుంటివి కాబోలు.

భీము.—ఓరీ! క్రవ్యాదా! నీ ప్రగల్భవాక్యంబుల కిచ్చట నెవ్వరును భయమందువారు లేరు!

తే॥ గీ॥ బలము గలదంచు నెంచి గ ♦ ర్వమును బూని
యేకచక్ర పురంబున ♦ నెల్ల జనుల.
హింసజేయుచు నుంటివి ♦ హీనచరిత
దాని నడగింపవచ్చితి ♦ దర్ప్యముగను.

ఓరీ! దురాత్మా! ధరాపాలుండు సామంతరాజులయొద్దను, ప్రజలయొద్దను గప్పము గైకొనుచుండు విధంబున నీవు పాపమని భావింపక నేకచక్రపురంబునంగల ప్రజలయొద్ద నిలువరుస బ్రతి దినంబును నొక మానిసి చొప్పున నాహారంబును గ్రహింపుచు కండబట్టియుంటివి. అదియెల్ల నీచే నేను గ్రక్కించెదను.

బకా—ఏమిరా! నీ కండకావరము.

కం॥ నరుఁడవు నీవు దలంపఁగ
నరభోజనుఁడ నగుదేను ♦ నాకును నీకున్
సరియగునే పోరాడగ
దురితాత్మా! పొమ్ము పొమ్ము ♦ దూరమ్మునకున్.

భీము—ఓరీ! నీ బీరంబులనింకఁ జాలింపుము. కాలము సమీపించిన జ్వరబాధితుండు సంధియెత్తి యీరీతినే ప్రేలుచుండును. దుర్మతీ నాచాఁటిబడిన నీవెందుబోగలవు. నేడు నిన్నెట్లయిన వధించి యేకచక్రపురవాసులు చిత్తంబుల సంతోషంబు నందుచు, దైత్యభయము లేకుండ సుఖించునట్లు గావించెద.

బకా—

శా॥ ఓహో! మృత్యువునీకు దారసిలిన ♦ ట్లుండెన్ రిపుస్తంభ స
ద్బాహాసంపదగల్గు మాదృశులతోఁ ♦ దార్కొలు జూడన్ గనున్
సాహంకారత పక్షినాధుని సమ ♦ క్షంబందు నిర్భీతితో
నాహా! యల్పఫణంబుద్రిప్పెడు మహా ♦ వ్యాళంబు చందంబునన్,

భీము — ఆరే! దైత్యాధమా! నీ భయంకరాకారంబును నీ యార్భాటంబులును జూచి యిక్కడ భీతిల్లువా డెవ్వడును లేడు. నీవలెనే నన్నెదిరించి హిడింబాసురుండు గతించినాడు.

శా॥ ఉద్దండాదివి ఖండనక్షత మహో ♦ ద్యద్ధ్వప్రసిద్ధప్రభా
బద్ధాస్మద్భుజదండ మండితగదా ♦ పాతా హతిన్ నీతలల్
బ్రద్దల్ జేసెద భూతజాలము మదిన్ ♦ బాగంచు గీర్తింపనా
గ్రద్దల్ మెక్కగమాంసఖండచయమున్ ♦ ఖండించి వైతున్ వడిన్.

నీ వేకచక్రపుర జనులను బెట్టుచున్న కష్టంబులన్నియు నేటితో యంతమొనవని తలంపుము.

బకా — ఓరీ! తుచ్ఛుడా! ఈ మాటలతో నేమి ప్రయోజనమున్నది. నీవే కాదు. చతుర్దశభువనంబులును నెక్కపెట్టున నెత్తివచ్చి నను నిసుమంతేయు భయంబందక వారి నందఱ జుట్టచుట్టి నా వదన గహ్వరంబున బ్రవేశపెట్టెదను.

భీము — కవిరాజ విరాజితము.

శరములు హస్తమునందున బూనుచు ♦ శౌర్యము జూపక యా
కరణిని విక్రమ ముండెనటంచును ♦ గాఋలు ప్రేలెదవే
సరగున నన్ను నెదిర్చి రణంబును ♦ సాహసమేర్పడగా
దురితరతా! యొనరింపుము నీదగు ♦ దోర్బలమున్ గనెదన్.

బకా — కవిరాజ విరాజితము.

మదినిసుమంతయు భీతినిబూనక ♦ మమ్మెదిరించెదవే
త్రిదశులుగూడను నన్నెదురింపక ♦ ధీరతబాయుగ; దు
ర్మదమున నీవిటు వచ్చితివా! సమ ♦ రంబు నొనర్చుటకై
మదమునుదూల్చెద బ్రాణము బాపెద ♦ మానవ! చూడుమిదే.

భీము — నక్తంచరాధమా! అనవసర ప్రసంగములతో నేమి ప్రయోజనమున్నది. ఇంచుక నిల్చి రణంబొనర్చుము. నీ బలంబును

నా బలంబును తెల్లమగును. గమ్ము.

(అని యిరువురును రణంబునకు మొనయుచున్నారు.)

బకా—ఇదిగో! ఈ దెబ్బ గాచికొనుము.

భీము—(తప్పించుకొని) ఇదిగో నీదెబ్బ తప్పించుకొంటిని ఈ ముష్టి ఘాతంబును జవిఁజూడుము.

బకా—ఇదిగో తప్పించుకొంటిని. వలసినేని బాణంబులు దెచ్చుకొని నాతో గయ్యంబొనర్పుము.

భీము—రాక్షసాధమా! నిన్ను జంపుటకు నా కాయుధంబులు గావలయునా! నా పిడికిటి పోటులే నిన్నంతం బొందించగలవు.

శా॥ రక్షోనాథమదేభకుంభదళన • ప్రజ్ఞా ప్రచండార్భటీ
దక్షాత్యద్భుత విక్రముండ; విలస • ద్ధర్మావనీపాల హ
ర్యక్షేంద్రప్రియ సోదరుండ; ఘన భీ • మాఖ్యుండ, దుష్టాత్మ త
ద్వక్షంబాయత తీక్ష్ణముష్టిహతి బ్ర • ద్దల్ జేతు వీక్షింపరా.

(అని దైత్యుని బట్టుకొని నేల బడవైచి)

ఉ॥ మించి పరాక్రమించితివి • మేదినియందున భీతిలేక; హిం
సించితివెల్ల భూసురుల • శ్రేయము నెంచక; నట్టి నిన్నిదే
దంచెద; బిండి పిండిగను • తప్పక నిప్పుడు సంతసంబు న
ర్పించెద నేకచక్రపుర • పృథ్వీసురౌఘము నన్ను మెచ్చగన్.

(బకుని జంపుచున్నాఁడు.)

బకా—(కేకలిడుచు ప్రాణములు విడుచును.)

భీము—(తనలో) ఇక్కడకీ దైత్యుండు మడిసినాడు. వీని భయంకరమైన కళేబరమును పురజనులు జూచుటకై పురిలోని కీడ్చుకొనిపోయెదగాక. (అట్లు చేయుచున్నాఁడు.)

(తెర వాలును.)

[రంగము:—విష్ణుశర్మ—ప్రవేశము.]

విష్ణు—(తనలో) ఈ పురంబున జాబాలి గృహంబున దిగిన యా యేవురు భూసురులను జూచిన నాకది యొక తీరుగ ననుమానము దోఁచుచున్నది. ఒక్క వనితయు నేవురు కుమారులును నాతని యింట బసచేసి యున్నారట. ఇది యిట్లుండ నందొక భూసురుండు యేకచక్రపురవాసులను జిరకాలమునుండి హింసింపుచున్న బకాసురుని గడతేర్చి ప్రజల రక్షించినాడట. ఒకవేళ వారణాసియందు లాక్షాగృహపావకజ్వాలలనుండి భగవంతుని కరుణచేఁ బాండవులు తమ జననియగు కుంతితోఁ దప్పించుకొని వచ్చి యీ పురంబున నిట్లు బ్రచ్ఛన్న వేషంబులతో మెలంగుచుండుట లేదుగదా. (ఆలోచించి) అవును. అట్లైంచు కుఁ గాఁగూడదు. నిరంతర శ్రీవాసుదేవ కరుణావర్ధిష్ణులగు వారేయుపాయంబునకును భాల్పుదురని తలంపను. అదియును గాక త్రిలోకభీకరుండైన బకాసురుని జంపుటకు సామాన్యుఁ డెవ్వఁడోపును. అట్టి కార్యము భీముడే జేసియుండునని నా యభిప్రాయము. నేను వారితో ద్రుపదపుత్రికా స్వయంవర మహోత్సవము జరుగునని మాటవరుసకు జెప్పితినిగాని, యవ్విషయంబునుగూర్చి నేను సవిస్తరముగఁ బ్రశంసించలేదు. వీరు నిజముగ బాండవు లగుదురా కారా యను సంశయము దీర్చుకొన్నచో నాకెంతయు నానందముగనుండి యుండునుగదా. నిశ్చయముగా వీరే పాండవులై యుండిరేని, వీరి వార్త నేను ద్రుపద మహీపాలునకుం దెలిపితినేని, "లాక్షాగృహదావంబున బడి దగ్ధులైపోయిరి? ఆ యర్జున కిచ్చుటకై యీ ద్రౌపదిని యగ్ని గుండంబున గాంచితి. అతని కొసంగ నిర్దేశించిన యువ

తిని నింకొకరి కెట్లీయనేర్తు" నని మిగుల విచార మందుచున్న యా రాజచంద్రుడు నా కెంతయో బహుమతి నిచ్చెనుగదా. ఇంతకును నాయదృష్ట మెట్లున్నదో. అరుగో! ఎవ్వరో! ఇటు వచ్చుచున్నారు. (పరికించి) ఎవ్వరో యనుకొన్నాను. జాబాలి గృహంబున బసచేసిన యేవురి భూసురులలో నివాడే. కానిమ్ము. ఇక్కడ నెవ్వరును లేరు. వీరు పాండవు లగుదురా కాదా యను సంశయ మిప్పుడు దీర్చుకొందు. (అని తన మూటలో నున్న ద్రౌపదియొక్క చిత్రపటమునుదీసి జూచుచున్నాడు.)

[బ్రాహ్మణ వేషధరుండైన యర్జునుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

అర్జు—(తనలో) ఈ పురంబున కరుదెంచి మేము విడిసిన గృహమందే విడిసిన, పాంచాలరాజ పురోహితుండగు విష్ణుశర్మ మాతో రాఁగల పౌషమాసంబున శుక్లపక్షంబున సప్తమియు రోహిణి నాడు, యా రాజేంద్రుని పుత్రికయగు ద్రౌపదికి స్వయంవర మహోత్సవంబు జఱుపబడునని చెప్పెను. ఆ స్వయంవర మహోత్సవంబున కనేక రాజులేగుదురు; కాని మేమట్టిభాగ్య మును నోచికొంటిమో లేదోకదా. (దుర్యోధను నుద్దేశించి) ఓరీ! దుర్యోధనా! నీమూలంబున మే మెట్టిసంకటములబాల్పడితిమి రా! ఎవ్వని బాహుదండముననిలిచి హస్తినాపురరాజ్యలక్ష్మి యొకింతయైన చలింపక నిల్చెనదో యట్టి నీపినతండ్రియగు పాండుభూవరునకుఁ బుత్రులమైన మాచే బ్రాహ్మణవేషంబుల బిచ్చమెత్తునట్లు గావించితివి. కానిమ్ము. ఈపాపంబంతయు నీ వనుభవింపకపోవు. (ఎదుట విష్ణుశర్మనుజూచి) ఇదుగో! ఇంతకు బూర్వము జాబాలిగృహమున భుజించిన ద్రుపదరాజపురో

హితుండు (విష్ణుశర్మనుజూచి) భూసురోత్తమా! నమస్కారములు.

విష్ణు—శీఘ్రమేవ వివాహసిద్ధిరస్తు!

అర్జు—మహానుభావా! మీకునాయందుగలిగిన వాత్సల్యముచేత నట్లు దీవింపుచున్నారుగాని, పురాకృతప్రారబ్ధవశంబున నిట్లు చరింపుచున్న మాకు వివాహమెట్లగును.

విష్ణు—నాయినా! ఇందుఁ బరులెవ్వరునులేరు. నీవును బ్రాహ్మణుండవే! నేనును బ్రాహ్మణుండనే. మీరు చేసికొన్న ప్రారబ్ధ మేమున్నది. ఇప్పుడు మీకుబడుచున్న యిడుములెవ్వి. నాకు వినిపించితివేని తగిన శాంతిజేయుటకు బ్రయత్నముజేయుదును.

అర్జు—పుణ్యపురుషా! నీ నిర్హేతుకజాయమానకటాక్షంబున కనేకవందనంబు లర్పించుచున్నాను. భగవంతుఁడు మా మానసపరీక్షార్థమై తెచ్చిపెట్టిన కడగండ్ల నాతడే దీర్పవలెనుగాని మానవమాత్రులకు దరంబుగాదు.

విష్ణు—(తనలో) ఈతనిమాటలనుబట్టి నాయనుమానము మఱింత యధికమగుచున్నది.

అర్జు—ఆర్యా! తమ హస్తమునందున్నది యేమిటి?

విష్ణు—ఇంతకుబూర్వమే ద్రుపదపుత్రికకు స్వయంవరమహోత్సవంబని జెప్పియుంటినిగదా. ఇయ్యది యాకన్యకయొక్క చిత్రపటమే!

అర్జు—దేవా! నన్నొకసారి చూచుట కనుగ్రహించెదరా!

విష్ణు—చిత్రపటమా! నీవుచూచెదవా! అంతకోర్కెయున్నదా!

అర్జు—అమ్మానినీ మణిసౌందర్యవిశేషంబుల నొక్కసారి కన్నులారగని సంతసించెదను.

విష్ణు—(పటము నిచ్చుచున్నాఁడు.)

అర్జు—(చిత్రపటంబునుజూచి) భూసురోత్తమా ! ఈమెసౌందర్యంబు జూచుటకీ రెండుకన్నులును జాలకయున్నవి.

తే॥ గీ॥ ఈమెతోఁబోల్పఁ దగువస్తు ♦ వేదియైన
జగమునందునలేదు ని ♦ శ్చయముగాను
నీమె కీమెయెసాటియా ♦ నెంచిచూడ
లేన లేదీమెబోలెడి ♦ లేమయెచట.

విష్ణు—నీవు నిజముచెప్పితివి.

అర్జు—ధరామరవర్యా! చూడుడు.

ఉ॥ మానినియిట్టి దుండెనేని ♦ తాపసులు గన్గొనియున్న; చంద్రబిం
బాననరూప చిత్రపట ♦ మంచితలీల గ్రహించివారి శ.
య్యానిలయంబులందుఁ దమ ♦ యంగనలెల్లరు రూపగర్వముల్
మానుటకై ఘటింపఁగను ♦ మానక నెంచుచు నుండరే సదా.

విష్ణు—నీవు వయస్సున నా కంటె జిన్నవాఁడవయ్యు మంచి మాట జెప్పినావు.

అర్జు—దేవా !

తే॥ గీ॥ ఏరినిఁ గృతార్థులుగజేయ ♦ నెంచినాఁడొ
గాక తన సృష్టి నేర్పులు ♦ గానిపింప
నయ్యజుండీమె నిర్మించి ♦ యులరినాఁడొ
తీర్చిపట్టులె యున్నది ♦ దివ్యవనిత.

(తనలో) ఈమె చిత్రపటంబును జూచినంతనే నా హృదయము చంచలించిపోయినది. ఇట్టి నారీమణిని జూచినంతనే పరమనిష్ఠా గరిష్ఠాత్ములయిన మునులే తమ తపంబులను విడిచి యీమెకు దాసులై వర్తింతుఁనుట కేమియు సందియము లేదు.

విష్ణు—భూసురా! ఈకాంత యెవ్వరిని కృతార్థునిఁ జేయుటకు జన్మించినదనియా యడిగితివి! అందుల కేమని ప్రత్యుత్తరం బిత్తునా యని యాలోచింపుచుంటిని.

అర్జు—దేవా! అట్లు వచియింపుచుంటి రేమి!

విష్ణు—ఏమియును లేదు. అయినను వినఁదలంచితివి గాన యీయుదంతంబు సవిస్తరంబుగ నీకుఁ దెలిపెద. వెనుక నొకనాడు పాండవకౌరవుల శస్త్రగురుండైన ద్రోణాచార్యుండు తన బాల్యసఖుండైన ద్రుపదుని సన్నిధి కరిగి తన బాలునకు క్షీరంబు నిమిత్తమై యొక గోవును నొసంగుమని కోర, ద్రుపదుండు ద్రోణుని సఖ్యంబును మఱచి యతనికి గోవు నొసంగక యనేక మాటలాడి పరాభవమొనర్చి పంపెను. అంతట నా యాచార్యుండు కరి నగరంబున కరుదెంచి కురుపాండవుల శస్త్రగురుండై యొక్క దినంబున నిరుతెగలవారిని జూచి గురుదక్షిణగా ద్రుపదుని గట్టి తెచ్చి తన కప్పగింపుడని యడిగెను. ఆమాటలు విని ముందు కౌరవులరిగి ద్రుపదుని చేఁ బరాజితులై యరుదెంచిరి. అనంతర మర్జునుండు చని నిర్వక్ర పరాక్రమంబున నా పాంచాలాధీశునితోఁ బోరాడి యాతనిని దన రథమునకు గట్టి తెచ్చి ద్రోణుని సన్నిధినిఁ బెట్టెను. ద్రోణుండును ద్రుపదున కేహానియు గూర్పకుండ నతనిని విడిచిపుచ్చెను. అనంతరము ద్రుపదుండు తత్పరాభవముచే ఖిన్నుఁడయ్యు నర్జునుని పరాక్రమంబునకు మెచ్చి యతనికి సతిగా దగిన కూతురును, ద్రోణుని వధించునట్టి కొడుకును బడయుదునని యథావిధిగ బ్రాహ్మణుల సన్నిధిని పుత్రికామేష్ఠి గావించెను. అప్పుడు యగ్నికుండమునుండి ద్రుష్టద్యుమ్నుఁడను పుత్రుండును, కృష్ణయను పుత్రికయు ను

ద్భవించిరి. కృష్ణ యనియు, ద్రౌపది యనియు, పాంచాలియనియు బిలువంబడు నా పుత్రికను ద్రుపదుం డర్జునున కీయదలంచి యుండగా, విధిప్రేరేపణంబున నా పాండవులు జననీ సమేతంబుగా వారణాసిని లక్కయింట దగ్ధులైరని విని మిగుల విచారించి యీ స్వయంవరము ఘోషింపజేసినాఁడు.

అర్జు—(తనలో) ఓ! ద్రౌపదీ కాంతాలలామా! నే నిప్పుడు సంపూర్తిగ నీకు దాసుండనైతిని సుమీ!

తే॥ గీ॥ కన్నులున్నట్టి ఫలమును • గాంచినాఁడ
నోరు నెవ్వంగ నుతియింప • నోచినాఁడ
గాని నిన్నును వైవాహి • కంబునాను
భాగ్యమిఁక గల్గునో లేదో • పశుపతి! యెఱుఁగ.

శా॥ నాకుఁ బెండిలిసేయఁగాదలఁచి భూ • నాథాగ్రణీమౌళి; స
ద్రాకాపూర్ణ సుధాకరాస్యను నినుఁ • రాజిల్లఁగాఁ గాంచి; యా
హా! కౌరవ్యులమాయలోఁబడినా • మంచుఁ మమున్ జూచి యా
త్మాకాంతుండు స్వయంవరంబు నిపుడుఁ • గావింపగాఁ నెంచెనే.

బ్రాహ్మణవేషంబుననున్న నేను స్వయంవరమున కెట్లరుదెంతును. అరుదెంచెదనుగాక! ఇతఁడే యర్జునుండని నిన్ను నాకు నీ తండ్రి యెట్లొసంగి పరిణయంబును సేయును. నాయంతట నేను చెప్పుకొన్నచోఁ బ్రయోజనము లేదుకదా. (ప్రకాశముగా) భూసురవర్యా! ఆ స్వయంవరంబున కన్నెను గొనుటకు ద్రుపదుండేవిధమైన నియమంబులు పెట్టెనా!

విష్ణు—ఏమి లేకుండ నెట్లు జరుగును. ఏదియును లేకపోయినచోఁ బ్రతివారును గన్నెను నాకిమ్మనియే యడుగుదురు. స్వయంవర సభామధ్యంబున నుంచఁబడు మత్స్య యంత్రమును గొట్టినవా

రికా కన్యక నిత్తునని చాట బంచినాడు. ఎవ్వరా మత్స్యయంత్రమును గొట్టుదురో వారే యక్కన్నియం గొనుట కర్హులు.

అర్జు—అట్లయిన బ్రహ్మణులు క్షత్రియులను విచక్షత లేనుకాబోలు.

విష్ణు—అట్టి దేమియును లేదు. ఎవరు ప్రయత్నించినను బ్రయత్నింప వచ్చును.

అర్జు—అట్లయిన మేమును తన్మహోత్సవ సమయంబునకు వచ్చుట కరుదెంచెదము. (ఎదుట కేగి) అదుగో వ్యాస మునీంద్రుండు కాబోలు వచ్చుచున్నాఁడు. నే నీతని కెదురేగి మా గృహంబునకు దోడ్కొనిపోవలయును.

(నిష్క్రమించును.)

విష్ణు—నేనును నరిగెద. వీరే తప్పక పాండవులని తోచుచున్నది. కాకున్న నితడు నిజమైన బ్రాహ్మణుడైనచో స్వయంవరమునకు దాను గూడ వచ్చెదనని యేల పలుకవలయును. నేనే భాగ్యవంతుడనగు యోగ్యత యుండెనేని వీరే పాండవులగుదురుగాక.

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము

సంపూర్ణము.





శ్రీ

# ద్రౌపదీపరిణయము.

## చతుర్థాంకము.

రంగము:—[యమునానదీ తీరము:—ప్రవేశము
అంగారపర్ణుఁడు, భార్యయగు కుంభీనస]

అంగా—సుందరవదనా! ఈ యమునా జలంబులనుండి వచ్చుచున్న మంద మారుతంబు మన దేహంబులకెంత విందొనగూర్చుచున్నదో గంటివా!

కుంభీ—మనోహరా! దానికేమిగాని యిది చూడుఁడు. ఈ యొడ్డున మన మాసీనులమైయుండ, తరంగములచే జలంబు లొడ్డును దాఁకునప్పుడు గాలిచే నీటి బిందువులు దేహమునకు దాఁకునప్పుడు మఱింత సుఖముగా నుండునుగదా.

అంగా—అవును నిశ్చయము. అదేచూడుము!

తే॥ గీ॥ జారచోరులు మదిలోన ♦ జాలిగుంద
నల చకోరకంబులు గడు ♦ హర్షమంద
బద్మములు దమ మోములు ♦ వంచివేయ
జందురుఁడుదయించె కాంతిని ♦ సాంద్రుఁడగుచు.

కుంభీ—ఆహా! ఆ సుధాకరుం డుదయించి తన సంపూర్ణమైన కళలను జగంబునఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడు. ఈతని రాక మన కిప్పుడెంతయు నానందకరముగదా!

అంగా—రమణీమణీ ! ఆతనిరాక యొకప్పుడు సంతోషకరంబును, నొక ప్పుడు దుఃఖదాయకంబుగూడ నగును.

కుంభీ—నాథా ! నీవట్లు వచియించెదవేల !

అంగా—

తే॥ గీ॥ పడఁతితోఁగూడి యంగార ♦ పర్ణుఁడిపుడు
వనవిహారము సేయంగ ♦ వచ్చెననుచు
దాడివెడలెను నావిూద ♦ దరుణి ! యపుడు
నీదు కరుణ లేకను గెల్వ ♦ నేరనతని.

కుంభీ—(సిగ్గుతోఁ దల వాల్చుకొనును.)

అంగా—సతీ ! లజ్జ నభినయించెదవేల ! ఈ సుందమూర్తకంబున కాత డు దోడై మన్మథునితోఁ జెప్పి నాపై బుష్పశరముల బఱుపఁ జేయుచున్నాఁడు.

వసంతతిలకము. సరోజపత్ర నేత్రి యిఁక ♦ జాలమేలనే
మరుండు పొంచి పొంచివేసె ♦ బాణ జాలముల్
బిరాననీవు ప్రేమబూని ♦ భీతి మాన్పవిూ
స్మరాంబకంబు లెల్లనిప్డు ♦ జక్కఁ జేయుచున్.

కుంభీ—ప్రాణేశ్వరా ! విూ సఱసంబుల కేమిగాని, ఆ సైకత స్థలం బందు గొంతకాలము విశ్రమింతమా !

అంగా—ఔరా రత్నమా ! ఆ సైకతస్థలములకన్న నివి బాగుండును చూడుము. వెన్నెల యగుటచే నేత్రపర్వ మొనరించుచున్న యీ మందార సహకార చందన కేసరి పున్నాగతాలతక్కోల వకుళజాజి కురువిందతపనహింతాలచూడవీప్రముఖతరు లతాము లెట్లు శోభిల్లుచున్నవో. ఈ పువ్వులన్నియు గోసికొని పుష్ప శయ్య నమర్చుకొందము. (అని పువ్వులు గోయుచున్నాడు.)

కుంభీ—నాథా! మీ పుష్పాపచయంబిక జాలును. రండు. ఇచ్చట గూర్చుందము.

అంగా—రమణీ! అయిపోయినది. మన మింతవరకును నామూలనున్న పుష్పతరులతాదులనువీక్షించి యుండలేదు. ఆ ప్రక్కనుగూడ విహరింతము రమ్ము.

కుంభీ—అబ్బా! నేను నడువజాలక యుంటిని. ఇంచుక కాల మిచ్చట విశ్రమింతము.

అంగా—

మ॥ స్తనభారం బధికంబు లేనడుము కొం ♦ చం బౌచు మెప్పారఁటన్
స్తనయుగ్మంబిటు లెమ్ము నేనదిక నా ♦ బ్జాతంబునఁ బట్టి మె
ల్లనగానిన్ నడిపించెదన్ మదికి నా ♦ హ్లాదంబు సంధిల్లఁ గా
ననుమానింపకరమ్ము సత్వరముగా ♦ నబ్జాత పత్రేక్షణా.

కుంభీ—(సిగ్గునఁ దల వాల్చును.)

అంగా—రమ్ము. (అని చేయి బట్టుకొనుచున్నాడు)

కుంభీ—ప్రాణేశ్వరా! ఏమికారణమోగాని నా చిత్తంబున నిప్పుడపరిమితమైన భీతి జనించుచున్నది. నా యెడమకన్నును నెడను భుజంబును నదరుచున్నది.

అంగా—బేలా! నేను నీయుండనుండగా నీకెట్టిభయము కలుగును. నా ప్రక్క నుండుము.

[అంత పాండవులు ప్రవేశించుచున్నారు.]

ధర్మ—తమ్ములారా! ఆ వ్యాసమునీంద్రుఁడు చెప్పిన వాక్యంబులు మీరు వింటిరిగదా. ద్రౌపదీ స్వయంవర మహోత్సవంబును గూర్చి మనకు సవిస్తరంబుగ దెలిపినాఁడు. అతని యానతిచొప్పున మన మచ్చట బ్రవర్తింపవలయును.

కుంతి—ఇట్టి సమయంబున మనకు ఘటోత్కచుఁడుగూడ సహాయముండిన బాగుగనుండునుగదా. ఆతడు జనించినవెంటనే యెప్పుడుదలంచిన నప్పుడరుదెంచెదనని చెప్పి తల్లియగు హిడింబిని దోడ్కొని తన యాశ్రమంబున కరిగినాడు.

భీమ—అమ్మా! నీకిప్పుడు భయమేలకలుగవలయును.

కుంతి—తండ్రులారా! నేను మాట వరుసకంటిని. మీరిందఱుండగా నాకేమిభయము! ఇంకను బాంచాలపురం బెంతదూరముండు నోగదా!

ధర్మ—అమ్మా! ఇప్పుడు మనము యమునానదియొద్దకు వచ్చినాము. ఇంక నప్పురము మనకు నైదుదినంబుల ప్రయాణముండును!

అర్జు—తల్లీ! నడువలేకుంటివి కాబోలు.

సీ॥ కుంతిభోజుని ముద్దు ♦ కొమరితవై యెంతయో
ప్రేమతో నచ్చోట ♦ బెంపుఁగాంచి
శిష్టగుణుండు వి ♦ చిత్రవీర్యసుతుండు
పాండుభూవల్లభు ♦ పాణిఁబట్టి
మహనీయమణిమయ ♦ మందిరంబులలోన
బరిచారికాతతి ♦ భక్తి గొలువ
సకలసౌఖ్యంబుల ♦ జాలబొందుచు నొప్పి
సాధ్వియంచు ఘనయ ♦ శంబుగాంచి

తే॥ గీ॥ బలపరాక్రమవిక్రమ ♦ వంతులైన
యేవురకుమారరమణులను ♦ నిట్లుగాంచి
యొప్పుచుండియు నీరీతి ♦ నడవియందు
గష్టములనందుచుంటివి ♦ గాదె! తల్లి.

కుంతి—వత్సా! విధవ్రాసిన యనుల్లంఘ్యనీయముగదా!

అర్జు—

సీ॥ ఘోరకాననభూము ♦ లే; రమణీయమ్మై
బఱగెడియుద్యాన ♦ వనములయ్యె
యడవులందుండు భ ♦ యంకరమృగముల
రవములే సంగీత ♦ రవములయ్యె
ప్రతియింటఁ దెచ్చిన ♦ మధుకరాన్నమె; భక్ష్య
పూరితమైనట్టి ♦ భోజ్యమయ్యె
మునీంద్రచంద్రుల ♦ పర్ణశాలలె; దివ్య
రత్నప్రభాసౌధ ♦ రాజియయ్యె
తే॥ గీ॥ నక్కటా! యంధుఁడౌ ధృతరాష్ట్రు ♦ నాత్మజాతు
కారణంబుననీరీతిఁ ♦ గ్రాలవలసె
పుట్టుభోగివినీవు ను ♦ మ్ములనుగూడి
కష్టముల బడుచుంటివి ♦ గాదె! తల్లి.

కుంతి—కుమారా! ఆగర్భశ్రీమంతులును, రాజ్యంబు బరిపాలింపదగిన వారును, విక్రమాఢ్యులును, బాల్య వయస్కులును నయిన మీరే యిడుములు బడుచుండగా, నేనా యోర్వజాలనిదానను.

భీము—ఇట్టి సంకటంబులన్నియు మనకీ ధార్తరాష్ట్రాగ్రజుని మూలంబున గలిగినవి. అన్నగారు మొన్న యనుజ్ఞ యిచ్చియుండిరేని గదామాత్ర సహాయుండనై యరిగి యా దురాత్ముని సోదర సమేతంబుగా నంతకునివీటి కీపాటి బుచ్చియేయుందును.

ధర్మ—కాలమునకుఁ గట్టుబడి యుండవలెను. వ్యాసమునీంద్రుండు మనకు శుభదినంబులువచ్చు కాలము సమీపించినదనియు, ద్రౌపదీ స్వయంవరమునకు మనలనుగూడ నరిగి బ్రాహ్మణ వేషంబులనే యుండుడనియుఁ జెప్పెనుగదా!

కుంభీ—(అంగారపర్ణునిజూచి) మనోహరా ! ఈ ప్రక్కనుండి యెవ్వరో పరులు వచ్చుచున్నారు. నాకు మిగుల భయమగుచున్నది. దేహము కంపమెత్తుచున్నది.

అంగా—రమణీ ! వారినిటు రానిమ్ము. (పాండవులు సమీపించుటఁ జూచి) ఓహో ! పరులారా ! అర్ధ రాత్రియు సంధ్యయు నీ రెండు కాలంబులును, భూత యక్ష దానవ గంధర్వులు దిరిగెడు కాలంబులని మీ రెఱుంగరు కాబోలు. ఇట్టి సమయంబులందు భూలోక నివాసులగు మానవులు సంచరించుటకు భయంబందుదురు. అదియుంగాక నిట్టివేళలయందు మేమెంతటి పరాక్రమవంతులనైనను నిర్జింపగలము. అట్టియెడ నేను తరుణితో నిచ్చట విహరింపుచుండ నా విహారంబునకు భంగముఁగల్గఁజేయ మీరు వచ్చుటకేల సాహసించితిరి. తెలిసియో తెలియకనో యరుదెంచిరి. ఇంక జీవితేచ్ఛగలవారేని సత్వరమ్ముగ నిచ్చోటు వాసిపొండు.

అర్జు—ఓయీ ! నీవెవ్వరవో ముందు మేమెఱింగియుండినఁగాని తగు ప్రత్యుత్తరంబు నొసంగఁజాలము.

అంగా—ఏమీ ! నే నెవ్వరినో మీకుఁ దెలుపవలయునా ! వినుము నేను యక్షేశ్వరుండగు కుబేరునకు బ్రియసఖుండ. మహాబల పరాక్రమ సంపన్నుఁడ. అంగారపర్ణాభిదానుండ. నిరంతరమును యీ నదీతీరమున కాంతా సమేతుండనై యిట్టి సమయంబులందు విహరింపుచుందును. మఱియు నివ్వనంబంగారపర్ణమను నామంబున దనరుచున్నది. నేను విహరించు సమయంబులందిచ్చట కెవ్వరును రానోపుదురు,

అర్జు—అంగారపర్ణా !

తే॥ గీ॥ భీతిఁబొందిన వారలి • వ్వేళలందు
సంచరింపక యుందురు • సాహసమున
బలము; శౌర్యంబు గల్గిన • వారమగుట.
సంచరింతుము గంధర్వ • సార్వభౌమ.

మాకెట్టివేళలయందునైన జరించుటకు హృదయంబులయందు భయముండదు. అందుచేతనే యిట్లు బయలుదేఱితిమి. (అని ముందుకు నడచుచున్నారు.)

అంగా—(అడ్డగించి) ఓ మనుష్యకీటకములారా! నా మాటల కెదురించి మీరందఱును నొక్కయదుగైనను నవతలఁ బెట్టగలరా? ఈ సమయంబున నీ నదియొద్దకు మీరు పోగూడదు. ఇయ్యది నాయది. నా యాజ్ఞ నుల్లంఘించి పోదలంచితిరేని మీకు ప్రాణంబులు దక్కవు. (ధనుష్టంకారమొనర్చును.)

అర్జు—గంధర్వుఁడా! నీ వీరాలాపంబులకిక్కడ భీతినొందువారెవ్వరును లేరు. అడవులయందును, నేఱులయందును నీకు స్వాతంత్ర్యమెట్లుండును. త్రిభువనపావనియు, సకల జనులకును సేవ్యంబయినదియు నైన యీ గంగ నీయది యెట్లగును!

సీ॥ హేమాచలమునుండి • యింపార జనుదెంచి
భాగీరథియనెడు • భవ్యనామ
మును ధరియించి యి • బ్భూమిపై శోభిల్లె;
భోగవతియటంచుఁ • బొలుపునందె
బాతాళమందున; • సురసిద్ధసాధ్యయ
చ్చరముని సేవ్యమై • సత్పథమున
మందాకినియను నా • మంబునరాజిల్లె;
నలపార్వతీశు జ • టాగ్రభాగ

తే॥ గీ॥ మందు ధరియింపగాబడి ♦ యఖిలలోక
సేవ్యమైనట్టి గంగను ♦ జేరవలద
టంచు సాహసంబున నీవ ♦ చించుమాట
నెవ్వఁడాలించు నిచ్చట ♦ హీనచరిత.

ఓయీ! ఇంక నీవు మా కడ్డురాకుము. అట్లు గావించితివేని నా బాణాగ్ని జ్వాలలయందు నిన్ను దగ్ధునిఁగా జేసెద. (నడచుచున్నాఁడు.)

అంగా—ఏమిరా! నీ కండకావరము. హీనమర్త్యుండవైన నీవే నన్నెదిరింపఁ దలంచితివా!

కవిరాజవిరాజితము.

నిలు నిలు మెచ్చటి కిప్పుడు బోయెదు ♦ నీచమనంబున; నా
పలుకుల నింతయు వీనులబెట్టక ♦ బాఱఁగ నెంచితివే
తులువతనంబును మానుము నీదగు ♦ దోర్బలమంతయు ని
ప్పుడె కనుపింపగజేయుము; ద్రుంచెద ♦ భూరి శరంబులచేన్.

అర్జు—(కోపావేశమున)

శా॥ ఓగోరీ! భయమింతలేక మదిలో ♦ నుగ్రాహవ క్రీడలో
ధీరత్వంబున నన్నెదుర్చుటకునై ♦ తీండ్రింపు చున్నాఁడవే
రారా నీబలమెట్టిదో కనెద; శ ♦ స్త్రాస్త్రంబులం గప్పి; నిన్
జేరంబుత్తును కాలువీటి కిపుడే ♦ శీఘ్రంబుగా దుర్మతీ.

నీ మాయలు, తంత్రంబులును, గంధర్వ విద్యలును నాయెదుట బనికిరావు. (తన యస్త్రమును జూచి) పూజ్యమగు నో యస్త్రమా!

మ॥ వరపాంచాల ధరాధినాయకు సుతన్ ♦ వైవాహికంబాడగా
సరగన్ బోవుచునుండ నీకరణి నీ ♦ చాత్ముండు గంధర్వ జే
డరయన్ మమ్ముల నడ్డగించెను మహా ♦ హంకారుడై; కావునన్
శస్త్రమా! వీని దహించివేయుము; కటా ♦ క్షంబూని నాపైనన్.

(అని మంత్రించి అగ్నేయాస్త్రము విడుచును.)

అంగా—(అస్త్రజ్వాలలంగాంచి) హా! చచ్చితి. చచ్చితి. (మూర్ఛ నందును.)

కుంభీ—(అంగారపర్ణునిం జేరి)

సీ॥ హా! మన్మనోహర! ♦ యస్త్రవిదుండైన
నితని నెదురించి ♦ తేలనీవు
మఱచితే నీవు ♦ మానినీమణి నీకు
జేయుచున్నట్టి ధర్మ ♦ సేవలెల్ల
అలుక జనించెనే ♦ యాత్మేశ నీకును
దోయజాక్షిపయి; నా ♦ దోషమేమి
కాంతతో నింక; సౌ ♦ ఖ్యంబులేల యటంచు
విసుకుదోచెనె మహా ♦ విక్రమాఢ్య

తే॥ గీ॥ హా! మదీయ పుణ్యఫలంబ! ♦ హా గుణాఢ్య!
హా! కుబేర సఖ! రణ వి ♦ ద్యా ప్రవీణ!
హా! విజిత చంద్రబింబ! స ♦ త్య పరిపాల!
హా! మనోహార! రవితేజ! ♦ హానిజేశ.

హా! ప్రాణేశ్వరా! బలపరాక్రమ విక్రమోపేతులని యెఱుంగక వీరి నేల యెదిరించితివి. అయ్యో! నన్ను విడనాడి పోవుటకు నీ చిత్తంబెట్లు సమ్మతించినది. యమునాతీరవిహారసౌఖ్యంబు నీతోఁగలసి యుండ దలంచి యరుదెంచిన నీ మనోహారిణగు నన్నిట్లొంటరిగా విడిచి పోవుట నీకు ధర్మమా! నీకై కన్నుల నశ్రుబిందువులు ప్రవాహంబుగా బాఱనట్లు విలపించు నీ ప్రియురాలిని నాదరింపకుండుట మేఱగాదు. సంపూర్ణపూర్ణిమా చంద్రబింబమును ధిక్కరించు నీ ముఖంబు నేడిట్లుధూళిచేఁ గప్పఁబడియుండ నేఁజూచి యోర్వఁగలనా! అక్కటా!

కలువ రేకులమించు నీ కన్ను గవమూసి యుంచితివేల. ఇదిగో! నీ కాంత నీ ప్రక్కఁజేరి విలపించుచుండగా నేల వీక్షింపవు. నీవు లేని యీ జగంబంతయు నంధకారబంధురమైన విధంబున నాకు గనుపించుచున్నది. (పాండవులఁజూచి) పరాక్రమశౌర్యవంతులగు నో మహాను భావులారా! నా విన్నప మాలకింపుఁడు. మన్మనోహరుండగు నీతండు ధర్మనిరతుండయ్యు నే మోహనిమగ్నుఁడై మీపరాక్రమంబు దెలియక మిమ్ముల నడ్డగించి యిట్టిపాటును బొందియున్నాఁడు. ఈతనివలన నేర ములేదని నేను జెప్పసాహసింపనుగాని పతిలేకున్న నేను ప్రాణంబుల భరింపఁజాలను. నాయందు గృపాంతరంగులై యీతనిదోషంబు మన్నించి నాకుఁ బతిభిక్షఁబెట్టుడు. లేదేని నన్నుగూడ నాతనిసన్నిధికిం జేర్పుఁడు. దీనసై వేడుచున్ననామొర నాలింపుఁడు.

కుంతి—కుమారులారా! ఆడుదానిమనస్సునకు గష్టము గల్పింపరాదు.

ధర్మ—తమ్ముఁడా! అర్జునా! ఈగంధర్వుని భార్యపలుకులు నాకెంతయు జాలిఁ గలుగఁజేయుచున్నవి. ఈయంగారపర్ణుడు మనయెడల నిట్టిసాహసము దెలియకజేసినాడు. కావున నీతనినిరక్షించి యీమెకు నానందంబుగలుగ జేయుము. నీయాగ్నేయాస్త్రంబు నుపసంహరింపుము.

అర్జు—(ఆగ్నేయాస్త్రంబు నుపసంహరించి యంగారపర్ణునిఁజేరి) అంగారపర్ణా! నీవింక భయంబువిడువుము. అన్నగారియాజ్ఞచే నీవు నాచే రక్షింపఁబడితివి. (కుంభీనసనుజూచి) సాధ్వీమణీ! నీవింక చింతదక్కుము.

అంగా—(లేచి పాండవులంజూచి) మహాత్ములారా! మీకు నమస్కరించుచున్నాను.

ధర్మ—అంగారపర్ణా! నీవింక భయంబునువిడువుము. మాచే రక్షింపఁబడితివి.

అంగా—పూజ్యులగు నోమహానుభావులారా!

తే॥ గీ॥ భవ్యభవదీయవిక్రమ ♦ బలములెఱుఁగ
జాలకను జేసినాఁడను ♦ సాహసంబు
ఫలముగాంచినాఁడను నిప్డు ♦ బవరమందుఁ
దప్పుమన్నించిబ్రోవుఁడీ ♦ దయదలిర్ప.

అయ్యలారా! నేను మీచే నోడింపఁబడితిని. అట్లుపరాజితుండ నగుటచేత నాయంగారపర్ణనామంబున దనరుటకు సమ్మతింపఁజాలను. మహాత్ములగు మీరు ప్రచ్ఛన్నవేషంబులనుండుటచే గుర్తింపలేకపోయితిని. ఇప్పుడు నాకు మీరు పాండవేయులని గోచరమునకువచ్చినది. (అర్జునునిజూచి) అర్జునా! వీరపురుషా! నేను నీచేత నోడింపఁబడియు, నారథంబు నీవాగ్నేయాస్త్రంబున దగ్ధంబుగావించినను గంధర్వమాయచే వేరొకరథము బడయుటచే నేటినుండి చిత్రరథుండను నామంబును దాల్చెద. మీయెడల నేనాచరించినదోషంబును మన్నించి మీతో సఖ్యము నాకు దయసేయుఁడు.

ధర్మ—గంధర్వరాజా! పాపముజేసియు పశ్చాత్తాపమునందుచుంటివిగాన నీయం దాదోషములేదు. నిన్ను నేటినుండియు మాకు బరమసఖునిగా భావించెదము.

అంగా—(అర్జునునిజూచి) పాండవమధ్యమా! నీపరాక్రమంబునకు నే నెంతయు మెచ్చితిని. నాయొద్ద చాక్షుషియను విద్యయొకటి కలదు. ఇయ్యది నేను తపంబునఁ బడసితి. దానిప్రభావంబు వర్ణింపదరముగాదు. దానిప్రభావంబున మూఁడులోకంబులును జూచి యథేచ్ఛగా జరింపవచ్చును. అయ్యది నీకొసంగెద. ఇంతియగాక మహాజవసత్వంబులును, గామగమనంబును గల గంధర్వహయంబులు మీయేవురకును నైదునూర్లొసంగెద, నా

యందు కరుణాంతరంగుడవై నీ యాగ్నేయాస్త్రంబు నాకొ సంగుము.

అర్జు—గంధర్వరాజా! ఎంతటిమిత్రునిచేతనైనను నుపకారమాచరించి యందులకు బ్రతిఫలముక్రింద ధనంబుగొనుటకు చిత్తంబు సమ్మతింపదు. అయినను నీయొద్దనున్న విద్య నీయంతటనీవు నాకిచ్చెదనని పలుకుచున్నావు. నీకుగావలసిన యాగ్నేయాస్త్రం బిదే యొసగెద. గైకొమ్ము. (ఆగ్నేయాస్త్రమునిచ్చును.)

అంగా—నీకు చాక్షుషి నుపదేశించెదను. (అర్జునునిచెవిలో నేదియో చెప్పును.)

ధర్మ—అంగారపర్ణా! నీవుమాకొసగెదనన్న రథంబును హయంబులును నీయొద్దనే యుంచుము. వలసినప్పుడు మేము తీసుకొనెదము.

అంగా—మీచిత్తమువచ్చినట్లాచరింపుఁడు.

అర్జు—గంధర్వశేఖరా! ఇకమాకరుగుట కాజ్ఞ యిచ్చెదవా!

అంగా—పాండవేయులారా! మీరు ద్రుపదరాజనందనస్వయంవరార్థమై యరుగుచున్నారని నాకుఁ దెలియును. మీరీమార్గంబున బోయితిరేని యొక యాశ్రమంబును జూడఁగలరు. అందు ధౌమ్యుండను భూసురుండుండును. అతనిని బురోహితునిగా గైకొని పాంచాలంబున కరుగుఁడు. మీయభీష్టంబులన్నియు నాతనివలన దీఱును.

ధర్మ—మిత్రమా! నీవుచెప్పినయట్లొనర్చెదము. ఇఁక మేమరిగెదము.

(నిష్క్రమించును.)

అంగా—రమణీ! నరసంచార మెక్కుడుగ నుండువేళయైనది. కావున మన నెలవున కరుగుదము. రమ్ము. (అంగారపర్ణుఁడు కుంభీనస నిష్క్రమించుచున్నారు.)

రంగము—[పాంచాలపురంబున నుద్యానవనము:—ప్రవేశము:—యొంటరిగా ద్రౌపది:—]

ద్రౌపది—(తనలో) ఆహా! ఈవార్త నిజమైయుండునా! నిశ్చయముగాఁ బాండవులు వారణాసిని కొంతేఁదఱ మ్మాయాకల్పితలాక్షా గృహదహనజ్వాలలయందు భస్మమైయుండిరా! అట్లయిన నే నింక జీవించుటయెట్లు. నన్నాయర్జునునకే యీయఁదలంచి యగ్నికుండంబునఁగాంచిన నా జనకుండింక నన్నెవ్వరికొసంగునో గదా! బాల్యంబునుండియు నాచిత్తంబును, దృష్టులును నర్జునునిపైననే 'నిల్పియుంటి. అట్టియెడ నాచిత్తం బన్యులపరించుటకు సమ్మతించునా! (అర్జునుని యుద్దేశించి)

సీ॥ కుంతీకుమార! నీ ♦ కునొసంగ మాతండ్రి
యంచితంబుగ నన్నుఁ గాంచినాఁడు
వీరచరిత్ర! వృ ♦ ద్ధ్వపయి మీరుమడిసి
రన్న వార్తలు దెలి ♦ యఁగవచ్చె
ధైర్య హేమాద్రి! నే ♦ తగనిదానను నీకు
నంచును మదిలోన ♦ నెంచినావొ
శత్రుభయంకర! ♦ సతిగాగ నీకును
బఱగనుండినదాని ♦ బాయనగునె

తే॥ గీ॥ అక్కటా! దుష్టుఁడగు కౌర ♦ వాగ్రజుండు
సృష్టిచేసిన యమాయ ♦ గృహమునందు
సోదరులఁగూడి జననితో ♦ సాక్షినావె
ద్రౌపదినొకింతమైనను ♦ దలపకుండ.

(ఇంచుక యూరకుండి) నిశ్చయముగా నా పాండవులు లాక్షా గృహంబున దగ్ధులై యుందురా! వాసుదేవ రక్షితులగు వారి నేయపా

యంబును బొందదని నాకు సంపూర్ణమైన నమ్మకము గలదు. అది యునుగాక, నేకచక్రపురంబున నేవ్వరు బ్రాహ్మణులును నొక్క వనిత యు నుండిరనియు నందొక్క బ్రాహ్మణుండు బకాసురుని వధించి యేక చక్రపురవాసులను రక్షించెననియు వినియుంటిని. ఆ యేవ్వరును పాండవులనియు నావనిత కుంతి యనియు నాకు దోచుచున్నది. దుష్టాత్ములగు కౌరవులకు దెలియకుండ పాండవులిట్టి ప్రచ్ఛన్నవేషంబుల నుండి యుందురు. (ఇంచుక యూరకుండి) ఏమి శుభంబు గలుగునోగాని నా యెడమకన్నును నెడమ భుజంబును నదరుచున్నది.

[ చెలికత్తెయగు నర్మద ప్రవేశించుచున్నది. ]

నర్మ—(ద్రౌపదినిం జూచి) చెలీ! ద్రౌపదీ! అది యేమి కారణము. నేను వనంబునకు నాతో జెప్పకుండ నొంటరిగా వచ్చెంచితివి.

ద్రౌప—ఏమియును లేదు.

నర్మ—ఏమియును లేకేమి. మీ జనకుండు రేపు స్వయంవర మహోత్సవ మాచరించునుగదా. నీకు బ్రాణేశ్వరుండరుదెంచునుగదా యను సంతోషంబున నన్ను మఱచియుందువు.

ద్రౌప—నర్మదా! ఎందుకే యిట్టి హాస్యంబులాడెదవు. నే నంతటి భాగ్యము నోచికొని యుంటినా!

నర్మ—ఆడుజన్మ మెత్తినతరువాత వరుడు రాకుండునా యేమి

ద్రౌప—"ఏదో బొంతకుఁదగిన గంత" యనునట్లు యెవ్వడో యొకడు వరుండగుటకా చూచుచుంటివి.

నర్మ—అట్లు గాక మఱి యెట్లు!

ద్రౌప—అట్లయిన నేను జీవంబులు విడువవలసినదాననే!

నర్మ—అది యేమమ్మా! అట్లు సాహసించి పలికెదవు. నీ మనస్సున నున్న విచారమెట్టిది.

మ॥ తరుణీరత్నము! నేఁడో రేపటనో యు ♦ ద్వాహంబు గావింపఁగా
ధరణీపాలుఁడు నిశ్చయించెఁగద మో ♦ దంబార; నీవట్టిచో
బరమానందముతోడ నుండకను భా ♦ వ్యంతాన నిట్లాడ; నీ
కరయఁగ జీవము బాయునంతపని యే ♦ లా చెప్పు బింబాధరీ.

ద్రౌప:—సఖి! సకలంబును దెలిసియుండియు నీరీతి నడిగెదవేల!

తే॥ గీ॥ ఎవ్వనికినన్ను నీయంగ ♦ నెంచి; యగ్ని
కుండమందున నాజను ♦ కుండుగాంచె
నట్టి విక్రమోపేతుఁడౌ ♦ యర్జునుండు
సోదరులతోడ నగ్నిలో ♦ సొక్కెనకట.

ఎప్పుడు నేను జన్మించితినో యప్పుడే నాచిత్తం బర్జునునకు వశమైనది. ఆతనిం దప్ప నే నన్యులనరింపనొల్లను.

నర్మ—అమ్మా! ద్రౌపదీ! పాండవులు నిశ్చయముగా మరణించిరని నీవు చెప్పగలవా.

ద్రౌప—అదియును నేను నిర్ణయింపజాలకున్నాను. కొందరు పాండవేయులు ప్రచ్ఛన్న వేషంబులతో నేకచక్రపురంబున నున్నారని చెప్పుచున్నారు.

నర్మ—అట్లయిన యీ విచారమెందుకు. రేపు స్వయంవరంబునకు దప్పక నరుదెంతురు. అం దర్జునుండు నిన్నుఁ గైకొనితీరును.

ద్రౌప—

తే॥ గీ॥ ఆకసమువంక జూచుచు ♦ నట్టెనిలచు
చాతకమునోటఁ బిడుగొ వ ♦ ర్షంబొ; పడెడు
భంగి; నెల్లుండి యాస్వయం ♦ వరమునందు
పాండవేయులజాడలు ♦ బయలుపడి; ము
దంబొ; చింతయోగల్గును ♦ దప్ప కతివ.

నాకు జింతయేగలిగనేని యన్యచింతను స్వాంతమునుదాల్పక ప్రాణంబులు బాసెదనని నమ్ముము.

నర్మ—అనఁగా ! నాకర్థము తెలియలేదు. పాండవేయులు బ్రతికియుం డనిచో నీవుకూడ ప్రాణంబులు బాయుదువనియా చెప్పచుంటివి !

ద్రౌప—అదితప్పు నేనుజేయవలసిన కార్యమింకొకటిలేదు. నాజనకుండు తపంబునంజేసి నన్నుగాంచుటకు యర్జునుండే కారణముఁడు. కావున వివాహమాడిన నాతనినే వివాహమాడవలెను. లేదేని యుసురులవీడి ముందుజన్మంబునందైన నాతని బతిగా బడసెదగాక !

నర్మ—చెలీ! నీమాటలు కడువిచిత్రముగనున్నవి. "తావలచినది రంభ, తామునిఁగినదిగంగ" యను నార్యోక్తిని ధ్రువపఱచుచున్నావు. కానిచో,

సీ॥ పండమంచము లేదు ♦ వసియింపగా నొక్క
మాణిక్యమందిర ♦ మైనలేదు
కట్టవస్త్రము లేదు ♦ పెట్టుటకొరులకు
భుజయింపవారికే ♦ భుక్తిలేదు
యేలుటకొకింత ♦ నేలమైనను లేదు
నిలచుటకెక్కడ ♦ స్థలము లేదు
యార్జించుటకుశక్తి ♦ యంతకన్నను లేదు
నిజరూపముననుండ ♦ నేర్పులేదు
తే॥ గీ॥ అట్టికుంతీసుతుని వివా ♦ హంబునాడి
సౌఖ్యములనేమికాంతువు ♦ సారసాక్షి
వట్టికోర్కెయెగాని ♦ లాభంబులేదు
నమ్ముమీనన్ను నీదగు ♦ నెమ్మనమున,

ఆపాండవేయులు శౌర్యంబుగలవారేని కౌరవులు పురినుండి వెడలనడుపునప్పుడేల యూరకుండిరి. శక్తిలేకనేగదా!

ద్రౌప—వారి పరాక్రమంబును గూర్చి, వారి ధర్మవ్రతాచారంబును గూర్చియు, వారి సత్యసంధతను గూర్చియు నీకేమియుం దెలియదు. తెలియనిదానవగు నీతో నేను వాదించుటవలనం బ్రయోజనము లేదు. ఈమహీచక్రంబుననున్న భూపాలురందఱును పాండవేయుల కాలిగోళ్ళకయినను జాలరుసుమా. వారు ధర్మపాశబద్ధులై ప్రస్తుతము కౌరవుల కొదిగియుండిరి. అంతియే గాని మఱియొండుకారణం బేమియు లేదు. ఇంతకును నాభాగ్యవిశేషంబున వారు బ్రతికియుండి స్వయంవరంబున కరుదెంచవలయునుగదా! అట్టిభాగ్యమును నేను నోచుకొని యుంటినో లేదో. పరమేశ్వరుండు నాపాల గలఁడో లేఁడో!

శా॥ బాలా యేలవిచారమందెదవు భూ ♦ పాలుండు వైవాహముల్
వాలాయంబుగ నేఁడొ రేపొ యిచటన్ ♦ గావింపనున్నాఁడు భూ
పాలాగ్రామణి యెవ్వఁడో యొకఁడు శం ♦ భల్లీలనయ్యంత్రముల్
గూలంజేయును నిన్నుఁ గైకొనును నీ ♦ కోర్కెల్ గదుందీఱునన్.

ద్రౌప—చెలీ! యెవ్వఁడో యొక రాజేంద్రుం డరుదెంచి మత్స్యయంత్రమునుగొట్టినచో నేనాతనిని వివాహమాడవలసినదేనా!

నర్మ—రమణీ! నీచిత్తమెట్లుండునోయని యింతవఱకును నదియొక తీరుగ భాషించితిని. పాండవేయులు జీవించియున్నారనియు, వారెచ్చటనో ప్రచ్ఛన్నవేషంబుల జరించుచుండిరనియు దెలిసియే యిట్టి స్వయంవరంబు జాటంబంపినాడు. అభేద్యమగు నామత్స్యయంత్రము గూలనేయుట కాయర్జునుడుతప్ప నితరులెవ్వరును

శత్రువులుగారు. స్వయంవరంబున కాతండరుదెంచి మత్స్యయంత్రము నూలనేసి నిన్నుఁ దప్పక గైకొనును.

ద్రౌప—సఖీ! నే నటువంటి భాగ్యంబును నోచికొనియుంటినా!

తే॥ గీ॥ నేను సరతంబుసేవింతు • నిఖిలలోక
జనని భగవతినాచిత్త • జలజమందు
నిలిచి నాయభీష్టముదీర్ప • గలమనో ద
లంపదో భాగ్యమెట్లుండు • నో; పడంతి.

ఉ॥ మానవసాధులెల్లగని • భానిని సన్నుతిఁజేయునట్లుగా
నానరుఁడేగుదెంచి వర • యంత్రము నూలగనేసి నన్నుఁదా
మానితరీతిగైకొనక • మానిన నాదగు సౌఖ్యమెల్ల నా
కాననసీమఁ గాయు నవ • కౌముదికిన్ సరిగాదెకోమలీ.

నర్మ—అమ్మా! నీవు విచారింపవలదు. స్వయంవరసమయంబునకుఁ దప్పక యర్జునుండేతెంచును. ధైర్యచిత్తవయి యుండుము. (ఇంచుక యూరకుండి) చెలీ! అటుచూడుము. విరహిణీజనంబులను వేపుటకై మేనల్లుండగు మన్మథునకు సహాయంబొనర్పఁ జంద్రుండు వెన్నెలఁ గాయుచుండెనాయనునట్లు నెల్లెడ నల్లిబిల్లిగ నల్లుకొన్న మల్లెపందిరులక్రిందఁ బడియున్న మల్లెమొగ్గలును, ఘుమ్మఘుమ్మని కమ్మని తెమ్మెరలమెసంగు జాజిపువ్వులును, గంధర్పుని హస్తంబుననుండెడు బాకులో యనందగిన కేతకీపుష్పములును, డెందంబుల కానందంబుగల్పించు మందారసుమబృందంబును, సువాసనచే మిగుల నెగడు పొగడపూలును, మాధవపదారవింద పూజార్హంబులగు మాధవీచయంబును, యుల్లంబుల నుల్లాసంబును వెల్లిగొలుప నెల్లెడ నల్లుకొన్న మల్లికాదివల్లికలనుండి రాలిన పూమొత్తంబులును,

కుసుమసౌరభ్యంబున నన్నిఁటను మించిన సంపంగిపూవులును, హృదయాహ్లాదకరంబులగు పారిజాతములును, పూవిలుకాడు తన శరంబులకు బదునువెట్టెడు నునుపైన పలకరాళ్ళేయనం దగిన కదళీతరువులయందు లేతయాకులును, చిలుకముక్కులచే నొక్కఁబడి కెంపురుచులీనెడి దాడిమీఫలంబులును, మార్గాయాససంజనితతృష్ణావిదారణ కారణంబులగు నారికేళంబులును, భూర్జకర్జూరపనసాది ఫలవృక్షరాజంబులును, విమల సలిలాసారంబులగు కాసారంబులును, దత్కాసారంబులచెంత మాయ సన్యాసులచందంబున దొంగజపంబాచరించుచు మీనంబుల బట్టుటకై వేచియున్న బకంబులును, లేమావి చిగురుమెక్కి మత్తెక్కి కోకోరావంబులసలుపు పికంబులును, ముద్దుపలుకుల శ్రీరామ శ్రీరామయనిపిలిచెడు శుకంబులునుగలిగి రమణీయమైయున్న యీవనంబునం దించుక కాలము విశ్రమింతమా !

దాక్షి—చెలీ! నేడేమియోగాని చిత్తంబున వనవిహారమన్న సంతసము జనింపకయున్నది. నీమాట నిరాకరించుచున్నందుకు నన్ను క్షమియింపుము.

నర్మ—అర్జునునిఁగూర్చి నీమనంబున బెంగజనించియున్నది. అంతకంటె మరొండుకారణ మేమియు లేదు అవ్విషయంబున నీవు చింతింపవలదని నేను చెప్పియుంటినిగదా. తరుణీ! ఈవనంబున నొక్కింతకాలము విహరించినచో నీమందమారుతము యొద్ద లికిసోకి సౌఖ్యముగాఁ జెదవు. రమ్ము.

దాక్షి—సఖీ! నన్నేలబలవంతపెట్టెదవు.

నర్మ—బలవంతముగాదు. నీవు పార్థుని దప్పక పెండ్లియాడుదువని సూచింపుచు సంతోషంబున నా నెమలిపురివిప్పి యెట్లు నృత్య

ము సేయుచున్నదో చూతుము. మనమా వైపునకుబోయి పలు విధములగు పుష్పంబులు కోసికొని గృహంబున కరుగుదము. రమ్ము.

(ద్రౌపతి చేయి బట్టుకొని తీసికొనిపోవుచున్నది.)

ఇది చతుర్థాంకము.

సంపూర్ణము.





శ్రీ

# ద్రౌపదీపరిణయము.

## పంచమాంకము.

[రంగము:—ఏకచక్రపురమునందలి రాజవీధి—విష్ణుశర్మయు రామశర్మయు చెఱియొకప్రక్కనుండి ప్రవేశించుచున్నారు].

రామ—(విష్ణుశర్మనుజూచి) విష్ణుశర్మగారూ ! విష్ణుశర్మగార్వా ! ఒక్కసారి యీలా దయచేయండీ !

విష్ణు—(వినిపించుకొనక తొందరగా నడచును)

రామ—ఏమండీ! పిలుస్తూవుంటే పలుకరు ! మీరు రాజుగారిసన్నిధిని యాస్థానపురోహితులని నాకు తెలియును. ఒకసారి నామాట వినిపోండీ !

విష్ణు—(రామశర్మనుజూచి) ఓహో రామశర్మగారా ! రండిరండి. నేను తొందరపనిమీాద వుండడంచేత మీామాట వినలేదు.

రామ—అవును. మీాతొందరపని నాకుదెలియును. ద్రౌపదీస్వయంవరమహోత్సవకార్యమంతా మీామీాదనే పాఱుతుందికాబోలు. సంభావనవిషయంలో నన్ను కొంచం కనిపెట్టాలి. మనమంతా సగోత్రీకులము.

విష్ణు—అయ్యో ! ముఖ్యంగా మీాకు సహాయంచేయడంకన్న నాకు కావలసినదేమున్నది. స్వయంవరమందిరమునకు మీారు వస్తారు కదా. అక్కడ మళ్ళీ కలుసుకొందాము. నేను తొందరగా వెళ్ళవలెను.

రాము—ఇప్పుడు మీరెక్కడికి దయచేస్తున్నారు?

విష్ణు—మనపురమునకు నెవ్వరో యేవురు భూసురులు వచ్చియున్నారట. వారు వేదములు తల్లక్రిందులుగా జదువగలరట. వారెవ్వరో కాస్త చూచివద్దామని వెళ్ళుతున్నాను.

రామ—వారిప్పు డెక్కడవున్నారు!

విష్ణు—ఒక కుంభకారుని గృహమందు బసచేసినారట.

రామ—బ్రాహ్మణులు కుంభకారునియింట బసచేసినారా!

విష్ణు—మీరల్లా ఆలోచిస్తారెందుకు. వారు సాక్షాత్పరబ్రహ్మస్వరూపులు. అదియునుంగాక నిశ్చలచిత్తు లెక్కడనుండినను నుండగలరు.

రామ—నేనును మీవెంట వారినిజూచుటకు రావచ్చునా.

విష్ణు—అవశ్యము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

రంగము—స్వయంవరమందిరము.

[నానాదేశపురాజులును—బలరామకృష్ణులును—భూసురులును నాసీనులై యుందురు.]

[దుర్యోధనుఁడు—కర్ణుఁడు—దుశ్శాసనుఁడు—ప్రవేశించుచున్నారు.]

దుర్యో—మిత్రమా! కర్ణా! పాండవులు లాక్షాగృహంబునబడి మ్రగ్గిరని మనము దలఁచుచుండఁగా వారెచ్చటనో ప్రచ్ఛన్నవేషంబులబూని చరించుచున్నారని యందరును జెప్పుకొనుచుండిరి. ఇది యేమైయుండవచ్చును.

కర్ణు—(తనలో) వాసుదేవరక్షితులయిన పాండునందనుల కెప్పటికిని నెట్టిహానియు సంభవింపదని నేను మున్నే యనుకొంటిని. (ప్రకాశముగా) రాజాగ్రణీ! ఒకవేళ వారు బ్రతికియుండిరని యే యూహింతము. దానివలన నీకేమి హానికలుగును!

దుర్యో—ఒకవేళ మాతండ్రిగారు వారలను మరల బిలచి ధర్మజునకు రాజ్యాభిషేకంబు సేయునేమోయని సంశయించుచున్నాఁడ.

దుశ్శా—అట్లయిన మఱల నేదియో యొక నెపముఁగల్పించి పురి వెడల నడిపింప జేయలేకపోవుదమా!

కర్ణు—ఆపరిశంసయుంతయు నిప్పుడేల. ఇప్పుడు మనము వచ్చిన కార్యమునందు వర్తింతము.

దుర్యో—కర్ణా! సకలరాజచంద్రులును స్వయంవరభవన మలంకరించినారు. అదిగో మత్స్యయంత్రముకూడ నక్కడ నమర్చబడియున్నది. ఆహా! ఈయంత్రమునుగొట్టినవారికేగదా కన్యక నొసంగుదురు!

దుశ్శా—అన్నయ్యా! అదినీకుఁ దృణప్రాయమేయని నే నూహించెదను. ఆ ద్రౌపదీదేవి తప్పక నాకు వదినెగారగునని శుభసూచకంబగుచున్నది.

దుర్యో—తమ్ముఁడా! నే నంతటిభాగ్యంబును నోచికొంటినా?

మ॥ ధరణీపాల కులావతంసులు సము • ద్యత్ప్రీతిరంబొంద దు
స్తరబాహాబలశౌర్య విక్రమమునన్ • ధాత్రీమండలంబందు న
వ్వరయంత్రంబును గూల్చియాద్రుపద భూ • పాలాగ్రణీపుత్రి స
త్కరముం బట్టగ నోచినానొ యటుగా • కన్ బ్రాప్తి యెట్లున్నదో.

శకు—కౌరవేశ్వరా! నీవు దీనివిషయమై సందియుంబంద నవసరము లేదు. ఆయంత్రముగొట్టుటకుఁ గృష్ణుండు సమర్థుఁడయ్యును దీని తెలుపునకు రాడు. పాండవులుండిరేని యంతర్జునుండు గూలచేయును. వారిజాడ యింతవరకును గానరాకున్నదిగదా. తక్కినరాజలోకంబున నెవ్వరును దీని గదల్పఁజాలరు. నీవే

సమర్థుండవు. నీవు తప్పక దీనింగొట్టి పాంచాలరాజసుతను వివాహ మాడఁగలవు. అట్లుగాదేని,

తే॥ గీ॥ ఘోరసమరంబునందున ♦ వీరినెల్ల
నోర్చి; రాక్షసవిధిని య ♦ య్యువిదఁదెచ్చి
నీకు నర్పించువాఁడను ♦ నిక్కముగను
నమ్ముమీ నన్నుఁ గౌరవ ♦ నాథవంద్య

దుశ్శా—కర్ణుఁడు దలంచెనేని యంతపనియుఁ జేయఁగలుగును.

దుర్యో—అందుకు సందియమేమున్నది. రండు. మన మాసనంబుల నధిష్ఠింతము.

(ఆసీనులగుచున్నారు.)

[ద్రుపదుఁడు—ధృష్టద్యుమ్నుఁడు—పురోహితుఁడగు విష్ణుశర్మయుఁ బ్రవేశించుచున్నారు.]

ద్రుప—(విష్ణుశర్మనుజూచి) భూసురవర్యా ! నీమాటలను నేను నమ్మవచ్చునా! నే నంతటిభాగ్యమును నోచికొనియుంటినా !

విష్ణు—మహారాజా ! మీరు నామాటలను నమ్మవచ్చుటయేగాక, యట్టిభాగ్యమును మీరిప్పుడే నోచనై యున్నారు.

ధృష్ట—తపోధనులగు భూసురులవాక్యంబులు రిత్తవోవునా!

ద్రుప—బ్రాహ్మణోత్తమా! కుంభకారుని గృహమందెవ్వరో యేవురు భూసురులు విడిసియుండిరని చెప్పితివి. వారును నిప్పుడీ స్వయంవరమందిరంబున కరుదెంచిరా!

విష్ణు—అరుదెంచియున్నారు.

ద్రుప—అట్లయిన నింక నాలస్యమెందుకు. స్వయంవరవేళగూడనాసన్నమగుచున్నది. మన మరిగి, మహోత్సవార్థమై యరుదెంచిన రాజులనందఱను యథోచితంబుగ గౌరవింపవలయును. గదా! (ఇంచుక నడచి తమతమ యాసనంబుల నధిష్ఠింతురు)

ద్రుప—(రాజులనందఱినిఁ జూచి) ఓరాజపుంగవులారా !

ఉ॥ పావనమయ్యెనాకులము ♦ పండెమదీయతపఃఫలంబు ; మో
దావహమయ్యెఁజిత్తము; సు ♦ తామణి ద్రౌపది పెండ్లివేళ ; సు
శ్రీవిలసిల్ల మీరలిట ♦ జేరుట ; శౌర్యసముద్రులార ; ధా
త్రీవిభులార! సంతత సు ♦ ధీరగుణాకరులార! యియ్యెడన్.

మ॥ ధరణీపాల కులావతంసులు సము ♦ ద్యత్కీర్తి విస్తారదు
స్తరబాహాబల విక్రమాఢ్యులిటుల ♦ స్మత్పుత్రి, కాసత్స్వయం
వరకార్యార్థము నేగుదెంచుటమదిన్ ♦ భావించివీక్షింప న
ద్దిర మందాకిని చొచ్చినేలపయి న ♦ ర్థింబాఱినట్లేగదా.

రాజన్యచూడామణులారా ! ఈస్వయంవరసమయంబున మిమ్ములనందఱి నొక్కచోటచూచుటకీ రెండుకన్నులును గడు పుణ్యము జేసికొనియున్నవి.

దుర్యో—

తే॥ గీ॥ భవ్యభవదీయసద్గుణ ♦ భావమొకటి
కన్యకామణిసౌందర్య ♦ గరిమ; రెండు
దివ్యయంత్రముగూల్పగా ♦ దీక్ష మూడు
మమ్మునిటకుఁ దెప్పించె ♦ మానవేంద్ర.

ద్రుప—(కృష్ణునిఁజూచి) కృష్ణా! వసుదేవనందనా ! బలరామసహితుండవైన నీరాక మాకెంతయు శుభప్రదంబని నేనూహించుచున్నాను. నీవు లీలామానుషవిగ్రహుండవగు భగవంతుండవుగాని సామాన్య మర్త్యుండవుగావు.

తే॥ గీ॥ ఏదలంచినరీతిగా ♦ నీస్వయంవ
రంబు బాగుగాజరుగు తె ♦ ఱంగుజూడు
నీవు సేయంగలేనిది ♦ యేదికలదు
భక్తరక్షణపారీణ ♦ వాసుదేవ.

కృష్ణ—

ఉ॥ నీవు మహానుభావుఁడవు ♦ నిర్మలధర్మవివేకశీల స
ద్భావమునీదుహృత్తు; నని ♦ తామణి ద్రౌపది గోరుకొన్న యీ
భూవరమాళి ధర్మసుతుఁడు ♦ పొందుగఁ గుంతియు గూర్చునీదు స
ద్భావమునందుమన్న పరి ♦ తాపముదీఱగ రాజపుంగవా.

ద్రుప—(తనలో) ఈమహాత్ముని వాక్యంబు లమోఘంబులు.

దుర్యో—(కర్ణునితో రహస్యముగా) కర్ణా! ఈమెమనంబునం దెవ్వరిని వరించుటకు సంకల్పించుకొన్నదో గదా.

కర్ణు—సంకల్పించుకొన్నంతమాత్రంబునఁ బ్రయోజనమేమియున్నది. ఆతఁడు మత్స్యయంత్రమును గూలనేయవలయునుగదా. ఆయంత్రముగొట్టుటకు నీకుదప్ప నితరులకు శక్తి చాలదు. మఱియు నక్కన్యక, సుందరవిగ్రహుండవును, సప్తద్వీపసముద్రముద్రిత మహీమండలయుంబు నేకఛత్రంబుగఁ బరిపాలించువాడవును, నఖండైశ్వర్యవంతుడవును, నిరదిభోగంబుల నందుచున్నవాడవును, నూర్వురతోఁబుట్టువుల కగ్రజుండవును, వైరివీర దర్పాంధకార ప్రభాకరుండవును నగు నిన్నుదప్ప యింకొకరిని వరించునా!

దుర్యో—(తనలో) భగవంతుండు నాపక్షంబున నున్నాడో లేదో. (ద్రుపదునిజూచి) ద్రుపదభూవరా! స్వయంవరవేళయాసన్నమగుచున్నది.

ద్రుప—(ధృష్టద్యుమ్నునిజూచి) కుమారా! ధృష్టద్యుమ్నా! నీవరిగి ద్రౌపదిని సమస్తాలంకృతినిగాఁజేసి సత్వరమ్ముగ దోడితెమ్మని యంతఃపుర పరిచారికల కాజ్ఞాపింపుము.

ధృష్ట—ఇదే తోడ్కొనివచ్చెద. (నిష్క్రమించును.)

ధర్మరాజు—(తమ్ములనుజూచి రహస్యముగా) తమ్ములారా! నిరంతర

మును మనల గాపాడుచున్న వాసుదేవుండుగూడ బలరామ
సహితుండై యరుదెంచియున్నాఁడు.

అర్జు—మనకు బాంధవుండును, సఖుండును, రక్షకుండునైన వాసు
దేవుం డెదుటనుండినను, యాతనితో మాట్లాడకుండ నుండ
వలసివచ్చెనుగదా.

భీమ—మనకిన్ని కష్టంబులగల్పించిన కురుకులపాంసనుండగు దుర్యోధ
నుండు వచ్చియున్నాడు. అగ్రజా! ధర్మనందనా!

మ॥ కలరిచ్చోటను సోదరోన్నృపమణుల్ ♦ గంజాక్షుడుంగూడ నా
బలరామాఖ్యునితోడవచ్చి నిలచెన్ ♦ భవ్యాత్ములైనట్టి వీ
రలసాన్నిధ్యమునందు; దుంచెదను గా ♦ రవ్యాగ్రణిన్ దుష్టు; ని
స్తుల కారుణ్యవిహీను; దుర్మతుని మ ♦ ద్దోర్దండ దర్పంబునన్.

ధర్మ—తమ్ముఁడా! ఇప్పుడు మన మెట్టివేషంబులనుంటిమి. ఇట్టి సాహ
సము బూననెంచుటయేమి.

అర్జు—అన్నయ్యా! వాయునందనా! ఈ మత్స్యయంత్రము గూల్చు
టకు నాకుఁదప్ప నితరులకు శక్తి చాలదు. బలరామకృష్ణులు
సమర్థులయ్యు దీనితెరవునకు రారు. ఇయ్యది నేనుగూల్చి
నప్పు డిచ్చట కలహంబు ప్రాప్తించితీరును. అప్పుడు కౌరవ
రాజుపైనున్న నీపగఁ దీర్చుకొనవచ్చును. (ఎదుటఁజూచి) అదు
గో! ధృష్టద్యుమ్నుండు చేటీపరివృతయగు ద్రౌపదిని దోడ్కొని
వచ్చుచున్నాఁడు. (తనలో) ఆహా! యేమి! ఈమెసౌందర్యము.

తే॥ గీ॥ సర్వలావణ్య సారముల్ ♦ నంతరించి
ముద్దగాఁజేసియొకచోట ♦ భూమిపైన
యువిదద్రౌపది సృష్టించి ♦ యుండనోపు
నలువమొగంబులవేల్పసి ♦ తలఁచువాడ.

అట్లుగాదేని;

మ॥ ఘననిర్మాణవిచిత్రమెల్లఁ దెలుపం ♦ గా; ధాత యాయావిధం
బున బ్రహ్మాండసృజించినా డిక నుసం ♦ పూర్ణంబుగా! వానినే
ర్పునుమించన్ సతినొక్కదానిసిలనే ♦ బుట్టింతునంచున్ రమా
తనయుండీమెను జేసినాడనుచు మ ♦ ద్భావంబునందెంచెదన్.

ఓ యువతీలలామా! ఏకచక్రపురంబున మీ పురోహితుండైన విష్ణుశర్మయొద్ద నీచిత్రపటము చూచినప్పుడే నేను దాసుండనయితిని. ఇప్పుడు నీ నిజరూపసందర్శనంబున నేనే నీకు వశుండనైతిని.

దుర్యో—(దుశ్శాసనునిజూచి) అదిగో ద్రౌపది పుష్పదామము చేత బట్టుకొని యామత్స్యయంత్రమును గొట్టినవారికంఠంబు నలంకరించుటకు వచ్చుచున్నది.

[ధృష్టద్యుమ్నుఁడు—నర్మదాసమేతయగు ద్రౌపదితో బ్రవేశించును.]

ద్రుప—(ద్రౌపదినిజూచి) కుమారీ! ద్రౌపదీ! ఇటురమ్ము. భవదీయ స్వయంవరార్థ మీ రాజపుంగవులందఱును విచ్చేసియున్నవారు. (కుమారునిజూచి) కుమారా! ఈవచ్చినరాజులనందరిని వేర్వేఱుగా నమ్మాయికి వినిపింపుము.

ధృష్ట—(ద్రౌపది చేయిబట్టుకొని) సోదరీ! ఇటురమ్ము అదిగోచూడుము. ఆ మొదటగూర్చున్నవాడు హస్తినాపురాధీశ్వరుండును, నధికైశ్వర్యసంపన్నుఁడునునగు దుర్యోధనుండు. అతని ప్రక్కనున్నవాఁ డతనికిఁ బ్రాణసఖుండైన కర్ణుండు. అతనిచుట్టును బరివేష్టించియున్నవా రందఱును నతనితమ్ములయిన దుశ్శాసనాదులు.

ద్రౌప—(తనలో) వీనిముఖఁబుజూచినఁ బంచమహాపాతకంబులు గలుగును. వీఁడెగదా పాండవులను పురినుండి వెడలనడిపినాడు.

ధృష్ట—అమ్మాయీ! సోమదత్తభూరి శ్రవశ్రుతసేనాదులు మువ్వురును వరుసగానున్నారు. అదుగో నాచేతికెదురుగా నాసీనుండై యున్నవాడు మత్స్యదేశాధీశ్వరుండైన విరటుండు. అతఁడు భుజవీర్యసింధుండైన జరాసంధుండు. ఆతనిప్రక్కను మొదట నాసీనుఁడై యున్నవాడు యదుకులపుంగవుండైన శ్రీకృష్ణుండు. ఆతనిప్రక్కనున్నవా డతని కగ్రజుండగు బలరాముండు. వీరిరువురును భగవదాంశ సంభూతులు. ఆతనిని బరివేష్టించినవారందరును యదువృష్టిభోజాంధక ప్రముఖులు. అదుగో చేకితానశిశుపాల పౌండ్రకవాసుదేవులచ్చట నున్నవారు. ఆప్రక్కనున్నదియంతయు భూసురబృందము. ఇందులో నెవ్వరు మత్స్యయంత్రమును గొట్టుదురో వారిగళంబును నీవు పూలహారంబుతో నలంకరింపుము. ఆతఁడే నీకు నాథుఁడగును.

విష్ణుశర్మ—స్వయంవరకాలమా సన్నమగుచున్నది. రాజులందరును నీమత్స్యయంత్రమును గొట్టుట కుపక్రమింపవచ్చును.

ధృష్ట—

తే॥ గీ॥ ఎవరుమోపెట్టి యీవిల్లు ♦ నేనుబాణ
ములను మత్స్యంబుగూల్తురో ♦ భుజబలమున
వారి వరియించుద్రౌపదీ ♦ వారిజాక్షి
గాన యత్నింపుడందుకు ♦ క్ష్మాపులార.

విష్ణు—ఓరాజన్యచూడామణులారా! ఎవ్వరీవిల్లును మోపెట్టి యంత్రమధ్యముననున్న మత్స్యంబును నైదుశరంబులచేగూల్తురో వారినే మారాజపుత్రిక వరించును. కల్యాణమునకును, భుజబలంబును, బాణలక్ష్యంబును పలువురిసముఖంబున గనబఱచి యశంబందుటకును నిదియే మంచిసమయము కావున మీమీ బలాబలంబుల జూచుకొనుఁడు.

16

బల—(కృష్ణునిఁజూచి) తమ్ముఁడా! ఇందుకు నీవేమయినఁ బ్రయత్నింపఁ దలంచితివా !

కృష్ణు—నేనేకాదు. మనవారిలో నెవ్వరినిగూడ నిందులకు యత్నింపవలదని చెప్పితిని.

బల—తమ్ముఁడా! అందులకు గారణం బెఱుంగవచ్చునా !

కృష్ణు—ఆసంగతి నింకసిప్పుడు బయలుపఱుపవచ్చును. ఈమత్స్యయంత్రముగొట్టుటకా రాజలోకంబున నెవ్వరును శక్తులుగారు. యర్జునుండొక్కడే దీనిని గొట్టఁగల సమర్థుండు.

బల—ఆయర్జునుండిప్పు డెట్లువచ్చును. పాండవులందఱును లాక్షాగృహంబున దగ్ధులైరని వింటిమిగదా.

కృష్ణు—అన్నయ్యా! వారట్టియాపదకు బాలుపడుదురా !

బల—తమ్ముఁడా వారు సుఖులైయుండిరా! అట్లయిన వారిసేమంబు వినుటకు నాచిత్తంబు తత్తరమందుచున్నది.

కృష్ణు—అట్లయిన నరుగో చూడుము. పాండవులేవురును భూసురవేషములతో నచ్చట నున్నవారు. అందు బార్థుండే యీ మత్స్యయంత్రమును గొట్టును.

బల—తమ్ముఁడా ! నేఁడెంతయు సుదినము.

[అంత కొందరు రాజులు మత్స్యయంత్రమును గొట్టుటకు బ్రయత్నించి విఫలమనోరథులగుచున్నారు.]

దుర్యో—(కర్ణునిఁజూచి) మిత్రమా ! కర్ణా ! వీరెవ్వరును నీయంత్రమును గొట్టఁజాలకపోయిరే. ఇంక నేను బ్రయత్నించెదను. (అని లేచి రెండడుగులువేసి) అహా! ఏమిది! మత్స్యయంత్రంబునుఁగొట్టి ద్రౌపదిని గైకొనఁదలంచుచున్న నాచిత్తంబున నధైర్యము జనించుచున్నది. దేహము కంపమెత్తుచున్నది. యుం

త్రింబు సమీపించుటకే భయమగుచున్నది. కానిమ్ము. భగవంతుఁ డెట్లుసేయుచున్నాఁడో. (మత్స్యయంత్రము సమీపించి దానిని గొట్టలేక చతికిలఁబడుచున్నాఁడు.)

(అందరును చప్పట్లుకొట్టుదురు.)

విష్ణు—(మన్త్రోథనునిజూచి) ఓరాజా! నీవు చాలా శ్రమపడ్డావయ్యా! కాశీలో లక్షయిల్లు కట్టించడమనుకొన్నావుకాబోలు.

ద్రౌప—(తనలో) ఈరాజేంద్రునకు దగిన పరాభవమైనది. (యించుక యూరకుండి) అక్కటా! నాహృదయము నపహరించిన పార్థుండింకెందుకు గానిపింపఁడే. ఈపురోహితుండగు విష్ణుశర్మ పాండవులు బ్రాహ్మణవేషంబులనుంకి యుందురనియు, వారు స్వయంవరంబునకు దప్పక యరుదెంతురనియు జెప్పినాడు. అయ్యో! నేనింక జీవించుటయెట్లు.

అర్జు—(ధర్మరాజునుఁజూచి) అగ్రజా! ఇయ్యంత్రము గూలనేయుటకు నేను బ్రయత్నించెద.

ధర్మ—తమ్ముఁడా! కానిమ్ము.

అర్జునుడు—(లేచి మత్స్యయంత్రమును సమీపించుచున్నాఁడు.)

ద్రౌప—(తనలో) ఈభూసురుం డెవ్వడో కడుధైర్యంబున యంత్రమును గొట్టుటకుకాబోలు దీసిని సమీపించినాడు.

గోవిందశాస్త్రి—(రామశర్మనుజూచి) రామశర్మగారూ! చూచినారా! ఈబ్రాహ్మణుని సాహసము. ఇంతమందిరాజులు కొట్టజాలని నీయంత్రమును నీతడు సమీపించుచున్నాఁడు. ఏదోమోస్తరుగా వైదికవృత్తినలనబ్రతికే మనకింతపని చేయదలంచుట యేమిటండీ!

రామశర్మ—శాస్త్రిగారూ! మన మల్లాగ అడానికి వలనుపడదు. ఏ

పుట్టలో యేపాముున్నదో. పరశురాముండు మనవాడేగదా. అతఁ డెట్టిపనులుజేసినాఁడు. మీరు మాట్లాడక చూస్తూ వుండండి.

అర్జు—(విల్లును నెత్తును.)

రామ—గోవిందశాస్త్రిగారూ!. చూచినారా ! ఏరాజేంద్రుడును నెత్తఁజాలనివిల్లు నీత డవలీలగా నెత్తినాడు. ఈతడీమత్స్యయంత్రమునుగూడ గూల్చును. ఓబ్రాహ్మణోత్తమా! మత్స్యయంత్రమునుగూల్చి జాతికి గీర్తి దెమ్ము.

దుర్యో—(కర్ణునిజూచి) మిత్రమా ! ఈపాఱు డెవ్వడోగాని యశ్రమముగా విల్లునెత్తి నారి నాకర్షించినాడు.

కర్ణ—నేనును నదియే యాలోచింపుచున్నాను. అదిగో ఆతడు గొట్టుటకు బ్రయత్నము నేయుచున్నాఁడు.

అర్జు—(విల్లును బట్టుకొని తనలో)

తే॥ గీ॥ సద్గుణుండగ్రజుడు సత్య • సంధుడేని
తల్లిసాధ్వీమణియగుచు • దనరెనేని
కాంతఁ బెండ్లాడుభాగ్యంబు • గలిగెనేని
నేలపై యంత్రమత్స్యంబు • గూలుగాక.

[యంత్రమును గొట్టుచున్నాఁడు.]

రామ—ఎల్లాగయినా బ్రాహ్మణతేజం బధికమయినదిగదా.

ద్రౌప—(అర్జునుని కంఠమునఁ బుష్పహారము వేయును.)

ద్రుప—(రాజులందఱినిఁ జూచి) క్షమావల్లభులారా! ప్రతిన ననుసరించి మీరందఱును జూచుచుండగా గగనమత్స్యయంత్రంబును భూసురుండు గొట్టినాడు. కావున మీరందఱును నాయెడ నను గ్రహించి వివాహమహోత్సవమగునట్లు యోచింపుడు.

దుర్యో—(కర్ణునిజూచి) కర్ణా ! చూచితివా ! ఈవిప్రుఁడు మనల నెట్లుపరాభవించినాఁడో! ఇప్పుడు వీనిని వదలకూడదు. (ద్రుపదునితో) ద్రుపదమహీధవా ! స్వయంవరార్థమై మమ్ముబిలచి యీరీతిఁ బరాభవింతువా ! ఇంతమంది వీరులయిన రాజరాజు లనేకులుండఁగాఁ నెవ్వఁడో యొక్క భూసురుండు మత్స్యయంత్రమును గూల్చినంతమాత్రముననే కన్యక నీతనికొసంగెదవా ! (ఇంచుక యూరకుండి) అయినను నిన్ననవలసిన పనియేమున్నది. ఇంతమంది నృపాలురను తృణీకరింపుచు నిట్టి యకార్యము జేసినందు కీభూసురు ననవలెను. (అర్జునునిఁజూచి) ఓయీ ! భూసురా ! గర్వాంధకారప్రమత్తహృదయా !

మ॥ ధరణీపాలురు పెక్కుమంది ముదిత ♦ త్వాంబులంబూని యీ
సరసీజాక్షిని బెండ్లియాడుటకునై ♦ జన్దెంచి యుండంగ; నీ
కరణిన్ వారికి సిగ్గుగొల్పుటకునై ♦ కాంక్షించి యంత్రంబునున్
ధరణిన్ గూల్తువె కన్నియన్ గొనఁగ; నీ ♦ దర్పంబు జూపింపుమా.

అర్జు—రాజా! మదోన్మత్తుండవై వీరాలాపంబు లాడకుము.

తే॥ గీ॥ భుజబలంబునుజూపించి ♦ భూమిపైన
యంత్రమునుగూల్చువారలే ♦ యతివఁగొనగఁ
నర్హులంచుననుటచే ♦ యంత్రమిపుడు
శౌర్యమున గూల్పగల్గితి ♦ క్ష్మాతలేంద్ర.

శౌర్యపరాక్రమంబులును భుజబలంబును జూపుటకు కులముతోఁబనిలేదు. నాభుజదర్పంబు జూచుటకు నీవెంతవాడవు. యంత్రమును గొట్టితిని. కన్నను గైకొందును. ఇందులకెవ్వరైన నడ్డం బరుదెంచిరేని వారిశీర్షంబులు డొల్లనేయుదును.

భీము—(సభనుండిలేచి) ఓరీ! కౌరవవంశపాంసనా !

ఉ॥ ఏమిర విప్రులుచుంటివి యు ♦ హీనబలాఢ్యుడితండు యంత్రముల్
గూలగ వేసెనీసభను ♦ గోముల్గి కొను నింకనట్టిచో
నీమదియందునోర్వకను ♦ నిట్టివిధంబున బల్కెదేల; ర
మ్మామిము నందఱిన్ దృటిని ♦ మారణజేతు భుజాబలంబునన్.

(అని యుద్ధమునకు మొనయుచున్నాడు)

కర్ణు—(అర్జునునిజూచి) రణంబనగా సంభాషణలకును, సంతర్పణలకును నరుగుటయని తలంచినావు కాబోలు రమ్ము. నీసత్వంబు దూలించెదను.

రామశర్మ—(భూసురులారా) మన బ్రాహ్మణుడు మత్స్యయంత్రము గూల్చినాడని కోపంబున గయ్యాళులు గాలుదువ్వుచున్నారు. వీరపురుషులయిన యీ బ్రాహ్మణులకు మనము సాయము చేయువలయును. ఆలోచించకండి. లెండి. జారీచెంబులు అంగవస్త్రంబులకు ముడివేసి గిరగిరత్రిప్పుచు తలలు చెక్కలయ్యేటట్లు కొట్టడం ప్రారంభించండి. లెండి లెండి.

అర్జు—ఓయీ! కర్ణా! మాటలతో నేమిపనియున్నది. ఇంచుక నిలిచి యుద్ధముజేసినచో నాశౌర్యంబు జూడగలవు.

భీమ—ఓరీ! దుర్యోధనా! మాభుజబలంబును దృణీకరించిన నీవెందు బోయెదవు. రమ్ము.

(కర్ణుడు అర్జునునితోడను దుర్యోధనుడు భీమునితోడను యుద్ధముజేసి పాఱిపోవుచున్నారు.)

ద్రుప—(కృష్ణునిజూచి) కృష్ణా! నాకిదియంతయు మిగుల చోద్యముగానున్నది. ఈయంత్రము నుగొట్టిన యీభూసురుం డెవ్వరు. దుర్యోధనకర్ణాది రాజబృందంబును రణంబున బాఱద్రోలిన వీరి

పరాక్రమంబు వర్ణనాతీతంబుగనున్నది. మహాత్మా! కరుణాంత రంగుఁడవై నా సందేహంబును బాపుము.

కృష్ణు—ద్రుపదమహీధవా! ఇంక నీయొద్ద నేమియు దాచఁబనిలేదు.

ఉ॥ ఎవ్వనికీయఁగాఁదలచి ♦ యెంతయు గోరిక నగ్నికుండమున్
దివ్యజాక్షిఁగంటివో మ ♦ హీశ్వరులందున శస్త్రవిద్యయం
దెవ్వడు మేటిగాబొగడఁగె ♦ నెవ్వడు లోకము బాసిపోయె వ్య
థవిధిచింతనొందితివొ ♦ యట్టినరుండితఁడే మహీధవా.

ద్రుప—కృష్ణా! ఏమి నాభాగ్యము ఈతఁడే యర్జునుఁడా. (అర్జునుఁ జూచి) అర్జునా! యన్నొకసారి కౌఁగలించుకొననిమ్ము. (కౌగలించుకొని) కృష్ణా! తక్కినవారందఱును నెచ్చట నున్నవారు?

కృష్ణు—దుర్యోధనునితో బోరాడిన యతండు భీముండు. ధర్మనకుల సహదేవులు గృహంబున కరిగినారు. కుంతియు నచ్చటనున్నది.

ద్రుప—ధృష్టద్యుమ్నా! నీవు పసిడిరథంబులను దీసికొనిపోయి వారి నందఱను మన మందిరమునకు దోడ్కొనిరమ్ము.

ధృష్ట—మంచిది. (నిష్క్రమించును.)

ద్రౌప—(తనలో) ఇప్పుడుగదా నాకు యానందముగలిగినది.

ద్రుప—అమ్మాయీ! నీవుకోరిన యర్జునుండు వచ్చినాడు. (కృష్ణుని జూచి) కృష్ణా! ఇంక వీరలకు వివాహంబు జరిగించవలయునుగదా.

కృష్ణు—రాజా! ఎల్లి వ్యాసుండిచ్చట కరుదెంచును. ఆతని యనుమతంబున మనము జేయుదము. నీయభీష్టము నెఱవేరినది. ఇంక నీకు గావలసిన దేమున్నది!

ద్రుప—దేవా! నాకు గావలసిన దింకేమున్నది. అయినను నిట్లుగుగాక!

మంగళమహాశ్రీ.

భూతలమునఁ బ్రజలు । భూరిసుఖముల్ గనుచుఁ
బుణ్యమతులై వెలయుఁగాత.
నీతముగవర్షములు । నేలబడగానెపుడు
నిండుఫలమీయుత పొలంబుల్
ఖ్యాతిగనురాజునెడ । గాంచితజనంబులతి
గౌరవముభక్తి ననిశంబుఁ
నేతయుసుధర్మగతి । నిఁదొలగకఁబుడమి
నిఁసతతమేలు ననురక్తిఁ.

ఇది పంచమాంకము సర్వమును



